శ్రీమతే రామానుజాయ నమః



శ్రీ వేదాంతదేశిక ప్రణీతమైన

# రఘువీరగద్యం

**(మహావీర వైభవం)**

**టీకా వివరణలతో**


**పండితరత్న, వేదాన్తవాచస్పతి**

ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు


ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి
112వ తిరునక్షత్రోత్సవ స్మారక ప్రచురణము

# రఘువీరగద్యం –టీకా వివరణలతో

పండితరత్న, వేదాన్తవాచస్పతి
**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు**

| | | |
|---|---|---|
| ద్వితీయముద్రణ | : | ఏప్రిల్ 2010 |
| ప్రతులు | : | 500 |
| సందర్భం | : | ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవం |
| వేదిక | : | శ్రీభాష్యకారభవనం, నరసాపురం |
| వెల | : | రూ. 20/- |
| అన్నిహక్కులు | : | వ్యాఖ్యాతవే. |
| ముఖచిత్రం | : | శ్రీరామపట్టాభిషేకం |

ఈ గ్రంథం శ్రీమాన్ జి. జలంధర్ రామానుజదాసుడు (చోడవరం)
సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో ముద్రింపబడినది.

ప్రతులకు : 1) శ్రీ జి. జలంధర్
వెలమవీధి, చోడవరం (పోస్ట్)
విశాఖపట్టణం - 531 036
ఫోన్ : 99599 05996

2) శ్రీమతి ఈ. జయలక్ష్మి
18-3-58/7, శాంతినగర్, కె.టి.రోడ్
తిరుపతి-517 507. ఫోన్: 0877-2232091

డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి.
ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.



శ్రీ వేదాంతదేశిక ప్రణీతమైన

# రఘువీరగద్యం

## (మహావీర వైభవం)

## - ప్రవేశికా -

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥

శ్రీ వేదాంతదేశికులచే రచింపబడిన స్తోత్రములలో రఘువీరగద్యమొకటి. దీనికి మహావీర వైభవమను పేరు కూడ కలదు. దేశికులే స్వయముగా ఈ స్తోత్రము చివరలో **"పఠత మహావీరవైభవం సుధియః"** అని పల్కుటను బట్టి ఈ పేరే దేశికులు నిర్ణయించియుందురని,అనంతరకాలమున రఘువీరగద్యమను పేరు ఏర్పడియుండ వచ్చునని భావింపవచ్చును. మహావీర శబ్దము శ్రీరామ చంద్రుని తెలుపును. భవభూతియు శ్రీరాముని మహావీర శబ్దముతో నిర్దేశించుచు **"మహావీరచరితమ్"** అను రూపకమును రచించెను. ఆ స్వామి గొప్పతనమును వర్ణించునది అగుటచే దీనికి మహావీర వైభవమను పేరు పెట్టబడినది.

దేశికులు రచించిన స్తోత్రములలో వచన రూపములో నున్న స్తుతి ఇది ఒక్కటియే. తమకు మాత్రమే సాధ్యమైన రీతిలో, ఆయా సందర్భములకు తగిన పదములను ప్రయోగించి, గంభీరమైన శైలిలో దేశికులు అనుగ్రహించిన ఈ స్తోత్రము పఠించువారి జిహ్వకు, వినువారి చెవులకు, అర్థమును గ్రహించువారి మనస్సునకును షడ్రసోపేతమైన విందువలె ఆనందమును చేకూర్చును. ఇందు శ్రీరామాయణములోని ఏడు కాండల కథలోగల ముఖ్య ఘట్టములు అన్నియు కూర్పబడియుండుటను గమనింపవచ్చును. అహల్యరాయిగా మాటినట్లు పల్కుట, రామచంద్రుని మిథిలానగర యువతులు చూచి, ఆనందించిరనుట ఇత్యాది అవాల్మీకీయ వృత్తాంతములును ఇందు కలవు. బహుశః దేశికులు వీనిని కంబ రామాయణము నుండి గ్రహించియుండవచ్చును.

ఈ స్తోత్రమును దేశికులు తాము తిరువహీంద్రపురములో నివసించు కాలమున రచించిరి. అచటి దేవాలయములో సీతతో, లక్ష్మణస్వామితో, హనుమానునితో కలసి అతివిలక్షణమైన తీరులో, అత్యద్భుతముగా సేవను అనుగ్రహించు శ్రీరామచంద్రుని అర్చామూర్తి దివ్యమంగళరూపమును దర్శించి, ఆనందపరవశులై, ఆ అనుభవ

పరీవాహరూపముగా దేశికులు ఈ స్తుతిని విరచించిరని వేదాంతదేశిక వైభవ ప్రకాశిక మొదలగు చంపుగ్రంథములు తెలుపుచున్నవి. ఆ అర్చామూర్తిని ప్రత్యక్షముగా దర్శించువారికి ఈ విషయమున సందేహము ఏ మాత్రము కలుగదు. అచటి స్వామి సౌందర్యము అంత గొప్పది. ఈ విధముగానే గోపాలవింశతి అను స్తుతిని కూడ దేశికులు తిరువహీంద్రపురములోని శ్రీకృష్ణుని అర్చామూర్తిని కీర్తించుచు రచించిరని సంప్రదాయము.

రఘువీరగద్య రచనను గూర్చి ఈ క్రింది వేరొక కథ కూడ ప్రచారములో ఉన్నది. కంచుఢక్క బిరుదం కల్గిన డిండిమభట్టు దేశికులతో వాదించుటకు వచ్చి, తన వద్దనున్న ఢక్కను వారికి ఇచ్చి – "ఈ ఢక్కను నీవు ప్రయోగింపుము. ఆ ధ్వనికి అనుగుణముగా నేను కవిత్వమును చెప్పెదను" అని పల్కెనట. దేశికులు పలు ఢక్కపై తాళాలను వాయింపగా, వానికి తగినట్లు డిండిమభట్టు కవిత్వమును చెప్పలేక పోయెను. పిమ్మట డిండిమభట్టు ఢక్కను వాయింపగా,దేశికులు తదనుగుణముగా పల్కినదే రఘువీరగద్య అయ్యెనట. ఈ స్తుతికి భారద్వాజ రాజగోపాలాచార్యులవారిచే రచింపబడిన విస్తృత మైన సంస్కృత వ్యాఖ్య ఒకటి కలదు. ద్రావిడభాషలో ప్రాచీనులు, నవీనులును వ్రాసిన వ్యాఖ్యలును కలవు. తెలుగులో ఈ గద్యకు ఒకటి, రెండు అనువాదము లున్నవి. కాని, వ్యాఖ్యానము వ్రాయబడినట్లు తోచదు. ప్రస్తుతము నాతి సంగ్రహము, అనతివిస్తృతమైన వ్యాఖ్య సహృదయానందము కొఱకు విన్నవింపబడుచున్నది. రసజ్ఞులగు పాఠకులు హంసక్షీరన్యాయమున ఈ ప్రయత్నమును ఆదరింతురని నమ్ముదును.

ద్వితీయముద్రణనుగూర్చి రెండు మాటలు.

సుమారు నాల్గు సంవత్సరాలకు పూర్వం మిత్రవర్యులు చీరాలవాస్తవ్యులు శ్రీరావిమోహనరావుగారు అందించిన ఆర్థిక సహాయంతో ఈ రఘువీర గద్య టీకా తాత్పర్యాలతో ముద్రింపబడింది. అయితే, ఒకటి రెండు నెలలలోనే ఆ ప్రతులన్నీ చెల్లిపోయాయి. దీనిని పునర్ముద్రించాలని అనుకున్న ఆ ఆశ ఇపుడు శ్రీరామచంద్ర స్వామికటాక్షంతో నెఱవేరుతున్నది. ఈ పునర్ముద్రణకు ఆవశ్యకం అయిన ద్రవ్యాన్ని నిండుమనస్సుతో చిరంజీవి, ఔత్సాహికుడు, భగవద్భాగవతాచార్య కైంకర్య నిష్ఠాగరిష్ఠుడు, శ్రీమాన్ జి. జలంధర్ (చోడవరం–విశాఖ) అందించారు. వీరి ఈ సంప్రదాయాభినివేశం నిత్యనూతనంగా వర్ధిల్లాలని మనసారా మంగళాశాసనం చేస్తున్నాను. రఘువీరగద్యకు దాసుడు సిద్ధం చేస్తున్న విపులమైనవ్యాఖ్యకూడా త్వరలో భగవద్భాగవతానుగ్రహం వల్ల వెలువడగలదని భావిస్తున్నాను. ప్రస్తుతం ముద్రింపబడే ఈ రఘువీర్యగద్య టీకా



తాత్పర్యాల గ్రంథం శ్రీరామచంద్రప్రభువు అర్చామూర్తిని ఆరాధ్యదైవంగా అర్చించిన అస్మత్పితామహచరణులు **ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి** తిరునక్షత్రోత్సవసందర్భంగా ఈ ఏడు నరసాపురంలో జరిగే తృతీయ వార్షిక ఉభయ వేదాంత పండితసభాకార్యక్రమాల సందర్భంగా ముద్రింపబడి, ఆవిష్కరింపబడడం సముచితం, సందర్భానుగుణం కూడా. పునర్ముద్రణ ప్రయత్నంలో సహకరించిన **శ్రీచంద్రశేఖర్‌గారికి, శ్రీహర్షవర్ధన్‌గారికి** అనేక కృతజ్ఞతలు. ఇతః పూర్వంవలెనే ఈ రఘువీరగద్య టీకా తాత్పర్యాలను సహృదయ పాఠకులు ఆదరిస్తారని నమ్ముతున్నాను. స్వస్తి.

**శ్రీసీతారామప్రభువరపదసరసీరుహద్వయసమీపే ।**
**రఘువీరగద్యటీకా సమర్ప్యతే శింగరార్యేణ ॥**

ఇట్లు, నివేదించు
భాగవత విధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీ వేదాంతదేశిక ప్రణీతమైన

# రఘువీరగద్యం

## (మహావీర వైభవం)

శ్లో॥ శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది॥

శ్లో॥ జయత్యాశ్రితసంత్రాసధ్వాంతవిధ్వంసనోదయః।
ప్రభావాన్ సీతయా దేవ్యా పరమవ్యోమభాస్కరః॥

1) జయ జయ మహావీర!

2) మహాధీరధౌరేయ!

### బాలకాండము

3) దేవాసుర సమర సమయ సముదిత నిఖిల నిర్జర నిర్ధారిత నిరవధిక మాహాత్మ్య!

4) దశవదన దమిత దైవత పరిషదభ్యర్థిత దాశరథిభావ!

5) దినకర కుల కమల దివాకర!

6) దివిషదధిపతి రణ సహచరణ చతుర దశరథ చరమ ఋణ విమోచన!

7) కోసలసుతా కుమారభావ కంచుకిత కారణాకార!

8) కౌమారకేళి గోపాయిత కౌశికాధ్వర!

9) రణాధ్వర ధుర్య భవ్య దివ్యాస్త్రబృంద వందిత!

10) ప్రణతజన విమత విమథన దుర్లలిత దోర్లలిత!

11) తనుతర విశిఖ వితాడన విఘటిత విశరారు శరారు తాటకా తాటకేయ!

12) జడకిరణ శకలధర జటిల నటపతి మకుటతట నటనపటు విబుధసరి దతిబహుళ మధుగళన లలిత పదనళినరజ ఉపమృదిత నిజవృజిన జహదుపలతను రుచిర పరమ మునివర యువతి నుత!

13) కుశికసుత కథిత విదిత నవ వివిధ కథ!

14) మైథిల నగర సులోచనా లోచన చకోర చంద్ర!

15) ఖండపరశు కోదండ ప్రకాండ ఖండన శౌండ భుజదండ!



16) చండకర కిరణ మండల బోధిత పుండరీకవనరుచి లుంఠాక లోచన!

17) మోచిత జనక హృదయ శంకాతంక!

18) పరిహృత నిఖిల నరపతి వరణ జనకదుహితృ కుచతట విహరణ సముచిత కరతల!

19) శతకోటి శతగుణ కఠిన పరశుధర మునివర కరధృత దురవనమతమ నిజ ధనురాకర్షణ ప్రకాశిత పారమేష్ఠ్య!

20) క్రతుహర శిఖరి కంతుక విహృత్యున్ముఖ జగదరుంతుద జిత హరిదంతి దంత దంతురదశవదన దమన కుశల దశశతభుజ ముఖనృపతికుల రుధిర ఝరభరిత పృథుతర తటాక తర్పిత పితృక భృగుపతి సుగతి విహతికరనతపరుడిషుపరిఘ!

### అయోధ్యాకాండము

21) అనృతభయ ముషిత హృదయ పితృ వచనపాలన ప్రతిజ్ఞావజ్ఞాత యౌవరాజ్య!

22) నిషాదరాజ సౌహృద సూచిత సౌశీల్యసాగర!

23) భరద్వాజ శాసన పరిగృహీత విచిత్ర చిత్రకూటగిరి కటకతట రమ్యావసథ!

24) అనన్యశాసనీయ!

25) ప్రణత భరత మకుటతట సుఘటిత పాదుకాగ్ర్యాభిషేక నిర్వర్తిత సర్వలోక యోగక్షేమ!

26) పిశిత రుచి విహితదురిత వలమథనతనయ బలిభుగనుగతి సరభస శయనతృణశకల పరిపతన భయచకిత సకల సురమునివర బహుమత మహాస్త్రసామర్థ్య!

27) ద్రుహిణ హర వలమథన దురాలక్ష్య శరలక్ష్య!

### ఆరణ్యకాండము

28) దండకా తపోవన జంగమ పారిజాత!

29) విరాధ హరిణ శార్దూల!

30) విలులిత బహుఫల మఖకలమ రజనిచర మృగమృగయారంభ సంభృత చీరభృదనురోధ!

31) త్రిశిరః శిరస్త్రితయ తిమిర నిరాసవాసరకర!

32) దూషణ జలనిధి శోషణ తోషిత ఋషిగణ ఘోషిత విజయఘోషణ!

33) ఖరతర ఖర తరు ఖండన చండ పవన!

34) ద్విసప్త రక్షః సహస్ర నలవన విలోలన మహాకలభ!

35) అసహాయశూర!

36) అనపాయసాహస!

37) మహిత మహామృధ దర్శన ముదిత మైథిలీ దృఢతర పరిరంభణ విభవ విరోపిత వికట వీరవ్రణ!

38) మారీచ మాయామృగ చర్మ పరికర్మిత నిర్భర దర్భాస్తరణ!

39) విక్రమ యశోలాభ విక్రీత జీవిత గృధ్రరాజ దేహదిధక్షా లక్షిత భక్త జన దాక్షిణ్య!

40) కల్పిత విబుధభావ కబంధాభినందిత!

41) అవంధ్య మహిమ మునిజన భజన ముషిత హృదయ కలుష శబరీ మోక్ష సాక్షిభూత!

## కిష్కింధాకాండము

42) ప్రభంజనతనయ భావుక భాషిత రంజిత హృదయ!

43) తరణిసుత శరణాగతి పరతంత్రీకృత స్వాతంత్ర్య!

44) దృఢ ఘటిత కైలాసకోటి వికట దుందుభి కంకాళకూట దూరవిక్షేప దక్ష దక్షిణేతర పాదాంగుష్ఠ దరచలన విశ్వస్త సుహృదాశయ!

45) అతిపృథుల బహువిటపి గిరి ధరణి వివర యుగపదుదయ వివృత చిత్రపుంఖ వైచిత్ర్య!

46) విపుల భుజశైలమూల నిబిడ నిపీడిత రావణ రణ రణక జనక చతురుదధి విహరణ చతుర కపి కులపతి హృదయ విశాల శిలాతల దారణ దారుణ శిలీముఖ!

## సుందరకాండము

47) అపార పారావార పరిఖా పరివృత పరపుర పరిసృత దవదహన జవన పవనభవ కపివర పరిష్వంగ భావిత సర్వస్వదాన!



## యుద్ధకాండము

48) అహిత సహోదర రక్షః పరిగ్రహ విసంవాది వివిధ సచివ విస్రంభణ సమయ సంరంభ సముజ్జృంభిత సర్వేశ్వరభావ!

49) సకృత్ ప్రపన్నజన సంరక్షణ దీక్షిత!

50) వీర!

51) సత్యవ్రత!

52) ప్రతిశయన భూమికా భూషిత పయోధిపులిన!

53) ప్రళయ శిఖి పరుష విశిఖ శిఖా శోషితాకూపార వారిపూర!

54) ప్రబల రిపు కలహ కుతుక చటుల కపికుల కరతల తూలిత హృత గిరి నికర సాధిత సేతుపథసీమా సీమంతిత సముద్ర!

55) ద్రుతగతి తరుమృగ వరూథినీ నిరుద్ధ లంకావరోధ వేపథు లాస్యలీలోపదేశ దేశిక ధనుర్జ్యాఘోష!

56) గగనచర కనకగిరి గరిమధర నిగమమయ నిజగరుడ గరుదనిల లవ గళిత విషవదన శరకదన!

57) అకృతచర వనచర రణకరణ వైలక్ష్య కూణితాక్ష బహువిధ రక్షోబలాధ్యక్ష వక్షఃకవాట పాటన పటిమ సాటోప కోపావలేప!

58) కటు రటద్ అటని టంకృతి చటుల కఠోర కార్ముక వినిర్గత విశంకట విశిఖ వితాడన విఘటిత మకుట విహ్వల విశ్రవస్తనయ విశ్రమసమయ విశ్రాణన విఖ్యాత విక్రమ!

59) కుంభకర్ణ కులగిరి విదళన దంభోళిభూత నిఃశంక కంకపత్ర!

60) అభిచరణ హుతవహ పరిచరణ విఘటన సరభస పరిపత దపరిమిత కపిబల జలధిలహరి కలకలరవ కుపిత మఘవజిదభిహననకృదనుజ సాక్షిక రాక్షస ద్వంద్వయుద్ధ!

61) అప్రతిద్వంద్వ పౌరుష!

62) త్ర్యంబక సమధిక ఘోరాస్త్రాడంబర!

63) సారథి హృత రథ సత్రప శాత్రవ సత్యాపిత ప్రతాప!

64) శితశర కృతలవన దశముఖ ముఖదశక నిపతన పునరుదయ దరగళిత జనిత దర తరళ హరిహయ నయన నళినవనరుచి ఖచిత ఖతల నిపతిత సురతరు కుసుమ వితతి సురభిత రథపథ!

65) అఖిలజగదధిక భుజబల వరబల దశలపన లపనదశక లవన జనిత కదన పరవశ రజనికరయువతి విలపన వచన సమవిషయ నిగమ శిఖర నికర ముఖరముఖ మునివర పరిపణిత!

66) అభిగత శతముఖ హుతవహ పితృపతి నిర్-ృతి వరుణ పవన ధనద గిరిశముఖ సురపతి నుతి ముదిత!

67) అమిత మతి విధి విదిత కథిత నిజ విభవ జలధి పృషత లవ!

68) విగతభయ విబుధ పరివృఢ విబోధిత వీరశయన శాయిత వానర పృతనౌఘ!

69) స్వసమయ విఘటిత సుఘటిత సహృదయ సహధర్మచారిణీక!

70) విభీషణ వశంవదీకృత లంకైశ్వర్య!

71) నిష్పన్నకృత్య!

72) ఖపుష్పిత రిపుపక్ష!

73) పుష్పక రభసగతి గోష్పదీకృత గగనార్ణవ!

74) ప్రతిజ్ఞార్ణవ తరణ కృతక్షణ భరత మనోరథ సంహిత సింహాసనాధిరూఢ!

75) స్వామిన్!

76) రాఘవసింహ!

## ఉత్తరకాండము

77) హాటకగిరి కటక లడహ పాదపీఠ నికటతట పరిలుఠిత నిఖిల నృపతి కిరీట కోటి వివిధ మణిగణ కిరణ నికర నీరాజిత చరణరాజీవ!

78) దివ్య భౌమాయోధ్యాధిదైవత!

79) పితృవధ కుపిత పరశుధరముని విహిత నృపహనన కదన పూర్వకాల ప్రభవ శతగుణ ప్రతిష్ఠాపిత ధార్మిక రాజవంశ!

80) శుభచరితరత భరత ఖర్విత గర్వ గంధర్వ యూథ గీత విజయగాథాశత!

81) శాసిత మధుసుత శత్రుఘ్నసేవిత!



82) కుశలవ పరిగృహీత కులగాథావిశేష!

83) విధివశ పరిణమ దమరభణితి కవివర రచిత నిజచరిత నిబంధన నిశమన నిర్వృత!

84) సర్వజన సమ్మానిత!

85) పునరుపస్థాపిత విమానవర విశ్రాణన ప్రీణిత వైశ్రవణ విశ్రావిత యశః ప్రపంచ!

86) పంచతాపన్న మునికుమార సంజీవనామృత!

87) త్రేతాయుగ ప్రవర్తిత కార్తయుగ వృత్తాంత!

88) అవికల బహుసువర్ణ హయమఖ సహస్ర నిర్వహణ నిర్వర్తిత నిజవర్ణాశ్రమధర్మ!

89) సర్వకర్మ సమారాధ్య!

90) సనాతనధర్మ!

91) సాకేతజనపద జనిధనిక జంగమ తదితర జంతుజాత దివ్యగతి దాన దర్శిత నిత్య నిస్సీమ వైభవ!

92) భవ తపన తాపిత భక్తజన భద్రారామ!

93) శ్రీరామభద్ర!

94) నమస్తే పునస్తే నమః!

95) చతుర్ముఖేశ్వరముఖైః పుత్రపౌత్రాదిశాలినే।
నమః సీతాసమేతాయ రామాయ గృహమేధినే ॥

శ్లో॥ కవి కథక సింహ కథితం కఠోర సుకుమార గుంభ గంభీరమ్।
భవ భయ భేషజమేతత్ పఠత మహావీరవైభవం సుధియః॥

శ్లో॥ కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥

* * *

## శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# రఘువీరగద్యం

**శ్లో॥ శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।**
**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది॥**

**శ్లో॥ జయత్యాశ్రితసంత్రాసధ్వాంతవిధ్వంసనోదయః।**
**ప్రభావాన్ సీతయా దేవ్యా పరమవ్యోమభాస్కరః॥**

**శ్లో॥ గద్యం శ్రీరఘువీరస్య ప్రణీతం దేశికోత్తమైః।**
**దాసః శ్రీశింగరార్యోఽయం వివృణోతి యథామతి॥**

ఆశ్రిత=దాసుల, సంత్రాస=భయము అనెడి, ధ్వాంత = అంధకారమును, విధ్వంసన=నశింపజేయుటకు, ఉదయః=ఉదయించినవాడు, సీతయా దేవ్యా= ప్రకాశించు సీతాదేవిచే,ప్రభావాన్=కాంతిని కలవాడు, పరమవ్యోమ = పరమాకాశ మనబడు వైకుంఠమునందు, భాస్కరః=సూర్యుడై వెలుగువాడును అగు శ్రీరామచంద్రుడు, జయతి = సర్వోత్కర్షతో వెలుగుచున్నాడు.

లోకమున సూర్యుడు చీకటిని పారద్రోలుటకై ఉదయించుచున్నాడు. తన కాంతితో ప్రకాశించుచున్నాడు. శ్రీరామచంద్రుడను సూర్యుడు తనను ఆశ్రయించినవారి భయమను చీకటిని నశింపజేయుటకై ఈ భూమండలమున ఉదయించినాడు. సూర్యుని కాంతి విడచి ఉండనట్లు, శ్రీరాముని సీత ఎడబాసి యుండదు. అందుచే ఆ స్వామి వైభవము నిరతిశయము, నిరుపమానమును. అతడు పరమాకాశమను వైకుంఠములో నిత్యము గొప్ప సూర్యుడై వెల్గుచున్నాడు. ఇట్టి శ్రీరాముడు సర్వాధికుడై ప్రకాశించుచున్నాడు.

ఈ లోకములోని సూర్యుడు భయమనెడి తమస్సును నశింపచేయలేకపోవుట, ఆకాశమున ఎల్లప్పుడు ప్రకాశింపకపోవుట మొదలగు కారణములవలన ఆ సూర్యుని కంటె శ్రీరాముడను సూర్యునకు కల అతిశయము వ్యక్తమగుచున్నది.

**1) జయ జయ మహావీర!**

మహావీర = గొప్ప వీరుడవగు శ్రీరామచంద్రా!, జయ జయ = (నీకు) జయ మగు గాక, జయమగు గాక.

శ్రీరామచంద్రా! చిరకాలము వర్ధిల్లుదువుగాక! లోకమున నీతో సమానులు, అధికులును వేఱొకరు లేనిరీతిలో, శత్రువులు సైతము పొగడు రీతిలో వీర్యగుణమును కలవాడవై వెలుగొందుదువు గాక!



**2) మహాధీరధౌరేయ!**

మహాధీరధౌరేయ = గొప్ప ధైర్యమును కలవారిలో అగ్రగణ్యుడా!

మనస్సున భీతికల్గు హేతువున్నను కొంచెము కూడ భయమును పొందక పోవుటకు ధైర్యమని పేరు. **"వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః"**అని ధీరశబ్ద నిర్వచనము. ఇట్టి ధైర్యగుణమును గొప్పగా కలవారిలో అగ్రేసరుడవగు శ్రీరామా! (అని భావము).

## బాలకాండము

**3) దేవాసుర సమర సమయ సముదిత నిఖిల నిర్జర నిర్ధారిత నిరవధిక మాహాత్మ్య!**

దేవ+అసుర=దేవతలకు, అసురులకు మధ్య జరిగిన, సమర సమయ= యుద్ధ సమయమునందు, సముదిత=ఉదయించిన(చేరిన), నిఖిల నిర్జర=అందఱు దేవతలచే, నిర్ధారిత=నిర్ణయింపబడిన, నిరవధిక=అంతులేని, మాహాత్మ్య=గొప్పతనమును కలవాడా!

పూర్వము దేవతలకు, అసురులకు మధ్య గొప్ప యుద్ధము జరిగెను. అందు పాల్గొనిన దేవతలు అసురులను జయించు సామర్థ్యమును లేనివారై, శ్రీమన్నారాయణుని వద్దకు చేరి తమను రక్షింపుమని వేడినపుడు, స్వామి అసురులను ఓడించి, దేవతలను కాపాడెను. అపుడు దేవతలందఱు **"అధికం మేనిరే విష్ణుమ్"** అన్నట్లు తమలో అందఱి కంటె విష్ణువే అధికుడని నిశ్చయించిరి కదా! శ్రీరామచంద్రా! ఇట్టి నిరతిశయ వైభవమును కలవాడవు నీవు.

**4) దశవదన దమిత దైవత పరిషదభ్యర్థిత దాశరథిభావ!**

దశవదన=పది తలలను కల్గిన రావణునిచే, దమిత=అణగద్రొక్కబడిన, దైవత= దేవతల, పరిషత్=సమూహముచే, అభ్యర్థిత=వేడికొనబడిన, దాశరథిభావ =దశరథుని పుత్రుడను భావమును కలవాడా!

రావణుడు బ్రహ్మవలన పొందిన వరముల బలముతో గర్వమును పొంది విఱ్ఱవీగి, దేవతలను మిక్కిలి బాధించెను. అట్లు బాధనొందిన దేవతలు, దశరథుడు సంతానార్థము చేసిన యాగములో కలిసిరి. వారపుడు తమ బాధ తీరు ఉపాయమును ఆలోచింపవలసినదిగా బ్రహ్మను ప్రార్థించిరి. ఆ సమయమున యాగములో సమర్పించిన హవిర్భాగమును స్వీకరించుటకై భగవానుడవగు నీవు వచ్చితివి. బ్రహ్మ మొదలగు దేవతలందఱు నిన్ను అపుడు రావణుని బారి నుండి తమను కాపాడవలసినదిగా ప్రార్థించి, అందులకై దశరథుని పుత్రునిగా అవతరింపవలసినదని వేడిరి.

**5) దినకర కుల కమల దివాకర!**

దినకర = సూర్యుని, కుల = కులము అనెడి, కమల = తామరపూవును వికసింప జేసెడి, దివాకర = సూర్యునివంటి వాడా!

లోకమున సూర్యుడు తామరపూవులను తన ఉదయముతో వికసింప జేయును. నీవు సూర్యకులమున అవతరించితివి. సూర్యకులము గొప్పతనమునకు స్థానమై, లోకమునకు సహాయపడి, ఆనందింపచేయుటచే తామరపూవువంటిది. ఆ కులమునకు నీ అవతారమువలన గొప్పతనము కల్గినది. కావున సూర్యకుల మనెడి తామర పూవును వికసింపచేయు సూర్యుడవై నీవు వెలుగుచున్నావు.

### 6) దివిషదధిపతి రణ సహచరణ చతుర దశరథ చరమ ఋణ విమోచన!

దివిషద్ = దేవతల, అధిపతి = ప్రభువగు ఇంద్రునియొక్క, రణ = యుద్ధమున, సహచరణ = సహాయముచేయుటలో, చతుర = సమర్థుడగు, దశరథ = దశరథుని, చరమ ఋణ = చివరి ఋణమును, విమోచన = తీర్చినవాడా!

దశరథుడు అన్ని దిక్కులయందు, దేవలోకమునందును రథమును నడపగల సమర్థుడు. దేవతలకు ప్రభువగు ఇంద్రుడు అసురులతో పలుమార్లు యుద్ధము చేయవలసివచ్చెను. ఇంద్రునకు అసురులను జయించుటకు వీలు కాలేదు. అపుడు ఇంద్రుని ప్రార్థనపై దశరథుడు దేవలోకమునకు వెడలి, యుద్ధమున అతనికి సహాయపడి, అసురులను పారద్రోలెను. ఇట్టి శక్తిని కల దశరథుడు వేదమును అధ్యయనము చేయుట ద్వారా ఋషి ఋణమును, యజ్ఞయాగాదులను నిర్వహించుట ద్వారా దేవఋణమును తీర్చెను. అతని చివరి ఋణమగు పితౄణము మాత్రమే సంతానమును పొందలేకపోవుటచే మిగిలియుండెను. ఆ ఋణమును నీవు దశరథునకు పుత్రునిగా జన్మించుట ద్వారా తీర్చితివి. "బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః" అను శ్రుతి వాక్యములో పితౄణము చివరి ఋణముగా తెలుపబడుటను బట్టి ఇచ్చట కూడా అది చరమ ఋణముగా నిర్దేశింపబడినది.

### 7) కోసలసుతా కుమారభావ కంచుకిత కారణాకార!

కోసలసుతా = కౌసల్యకు, కుమారభావ = పుత్రునిగా అవతరించుటచే, కంచుకిత = ముఱుగు పఱచబడిన, కారణ+ఆకార = కారణత్వమును కలవాడు!

జగత్తు అంతయు నీ వలన ఉద్భవించినదగుటచే అన్నిటికిని కారణమై యున్న వాడవు నీవు. ఇట్టి నీ మహిమను అంతటిని నీవు కప్పి పుచ్చుకొని కౌసల్యాదేవి గర్భము నుండి లోకములోని అందరు శిశువులవలె ఉద్భవించితివి. ఇట్లు గర్భవాసము, భూమియందు జన్మించుట, స్తన్యమును త్రాగుట, రోదించుట, ఇసుకలో ఆడుటవంటి నీ లీలలను చూచినవారు నీవు లోకమునకు కారణభూతుడవగు పరబ్రహ్మ అను విషయమును తెలిసికొనలేకపోయిరి.

### 8) కౌమారకేళి గోపాయిత కౌశికాధ్వర!

కౌమారకేళి=బాల్యక్రీడచే, గోపాయిత=రక్షింపబడిన, కౌశిక+అధ్వర= విశ్వామిత్ర మహర్షి యాగమును కలవాడా!



విశ్వామిత్రమహర్షి పలు యజ్ఞములను చేసెను. ఒక్కొక్క యాగమునందును రాక్షసులు చేయు ఉపద్రవము అధికమయ్యెను. ఒక్క యాగమునుకూడ పరిసమాప్తిని చేసి అవభృథస్నానమును ఆ మహర్షి చేయలేకపోయెను. అతడు దశరథ మహారాజు వద్దకు వచ్చి, ప్రార్థించి, నిన్ను, నీ అనుజుడగు లక్ష్మణుని వెంటకొని పోయెను. నీవు యజ్ఞవిఘ్నకారులగు రాక్షసులను వధించి, ఆ ముని చేయు యాగమును కాచితివి. ఈ కార్యమందు నీ వెట్టి శ్రమను పొందలేదు. రాక్షసులతో యుద్ధము చేయుట, వారిని వధించుట మొదలగునవి నీకు బాల్యక్రీడలుగనే అయ్యెను. ఇట్లు చిన్నతనమునందే నీవు చూపిన సామర్థ్యమునకు అవధి కలదా!

### 9) రణాధ్వర ధుర్య భవ్య దివ్యాస్త్రబృంద వందిత!

రణ=యుద్ధమనెడి, అధ్వర=యాగములో, ధుర్య=ముందు నిలచి, కార్యమును పూర్తి చేసిన, భవ్య=(నీ) వశములోనున్న, దివ్య=గొప్ప, అస్త్రబృంద= అస్త్రసమూహముచే, వందిత=నమస్కరింపబడినవాడా!

విశ్వామిత్రముని నీకు పలు అస్త్రములను ఇచ్చెను. ఆ అస్త్రములు నీకు సహాయ పడుటకై నీ ఎదుటకు వచ్చి నిలిచినపుడు యుద్ధము చేయునపుడు నీకు సహాయమును చేయుమని వానిని ఆజ్ఞాపించితివి. మారీచుడు మొదలగువారితో పోరు సలుపు సమయమున నీవు నీతిని తప్పక క్రమమున నడచుకొనుటచే అది ఒక యాగమువంటిది. యుద్ధసమయములో దివ్యాస్త్రములు నీముందు నిలచి, సహాయపడి నీకు విజయమును చేకూర్చినవి. కార్యమును పూర్తిచేసిన పిమ్మట ఆ దివ్యాస్త్రములు నీకు విధేయములై వినయముగా నీ ముందుకు వచ్చి నమస్కరించి నిలచినవి.

### 10) ప్రణతజన విమత విమథన దుర్లలిత దోర్లలిత!

ప్రణతజన=ఆశ్రయించి, నమస్కరించిన జనులయొక్క, విమత=శత్రువు లను, విమథన=మర్దించుటలో, దుర్లలిత=మిక్కిలి కఠినములైన, దోః= బాహువులతో, లలిత=అందముగా శోభిల్లువాడా!

నిన్ను నమస్కరించు భక్తులకు శత్రువులగు వారిపట్ల నీకు కోపము కల్గును. వారిని వధించుటలో నీ బాహువులు మిక్కిలి కఠినముగా ప్రవర్తించి, వారిని మట్టుపెట్టును. ఇట్లు వీర్యమును కల బాహువులతో నీవు అందముగా వెలుగుచున్నావు.

### 11) తనుతర విశిఖ వితాడన విఘటిత విశరారు శరారు తాటకా తాటకేయ!

తనుతర=మిక్కిలి చిన్నదైన, విశిఖ=నీ బాణము యొక్క, వితాడన=దెబ్బచే, విఘటిత=బాధింపబడినవారు, విశరారు=తమను బాధించువారెవ్వరు లేనివారు, శరారు=ఇతరులను బాధించువారును అగు, తాటకా తాటకేయ=తాటకను, ఆమె కుమారులగు మారీచసుబాహులను కలవాడా!

తాటక అను రాక్షసి మిక్కిలి క్రూరురాలు. ఆమెవలన దేశమున గొప్ప ఉపద్రవము ఏర్పడెను. ఆమె పుత్రులు అగు మారీచ, సుబాహు లిర్వురును ఆమెవలెనే జనులను పీడించుచు, మునులు చేయు యాగాదులను భగ్నమొనర్చెడివారు. వారిని ఎదిరించి, బాధించు వారెవ్వరును లేకుండిరి. కావున వారు బలగర్వముతో విర్రవీగి, జనులకు మిక్కిలి హాని కల్గించుచుండిరి. నీవు ఒక చిన్న బాణమును గొని, విశ్వామిత్రుని ఆజ్ఞను అనుసరించి తాటకను చంపి, ఆమె పుత్రుల గర్వమును అణచితివి.

**12) జడకిరణ శకల ధర జటిల నటపతి మకుటతట నటనపటు విబుధసరి దతిబహుళ మధుగళన లలిత పదనళిన రజ ఉపమృదిత నిజవృజిన జహదుపలతను రుచిర పరమ మునివర యువతినుత!**

జడకిరణ=చల్లనికిరణములను కల చంద్రునియొక్క, శకల=చిన్నభాగమును (చంద్రకళను), ధర=ధరించువాడై, జటిల=జటలను దాల్చువాడైన, నటపతి= నటరాజు అగు శివునియొక్క, మకుటతట=శిరస్సుపై, నటనపటు=నాట్యము చేయుటలో సమర్థురాలగు, విబుధసరిత్=దేవగంగ అను, అతిబహుళ=మిక్కిలి అధికమైన, మధుగళన=తేనెలధారతో, లలిత=అందమైన, పదనళిన=పాద పద్మముల, రజః =పుప్పొడితో, ఉపమృదిత=నశింపచేయబడిన, నిజవృజిన=తన పాపమును కల్గినదై, జహత్+ఉపలతను=విడచిన శిలారూపమును కల్గినదై, రుచిర=సుందరమైనదై, పరమ మునివర=గొప్పవాడగు గౌతమమునియొక్క, యువతి=భార్యయగు అహల్యచే, నుత=స్తుతింపబడినవాడా!

చంద్రుడు చల్లని కిరణములను కలవాడు. ఆ చంద్రుని శకలమును తన తలపై జటాధారియగు శివుడు దాల్చియున్నాడు. నటరాజు అగు శివుడు నీ పాదపద్మముల నుండి స్రవించు మధుధారయా! అనునట్లున్న దేవనదియగు గంగను తన జటాజూటమున ధరించియున్నాడు. శివుని తలపై నటనమాడు ఆ గంగయొక్క ఉత్పత్తిస్థానమగు నీ పాదపద్మముల రజస్సు (ధూళి) గౌతమ మహర్షి శాపమువలన శిలారూపమును పొందియున్న అహల్యపై పడినది. వెంటనే ఆమె పాపము పోయి, శాపము తీరగా, శిలారూపము వీడి, అందమైన తన రూపమును ఆమె తిరిగి పొందినది. అట్లు నిజరూపమును పొందిన అహల్య నిన్ను భక్తితో స్తుతించినది. అహల్య శిలారూపమును పొందినట్లు వాల్మీకి రామాయణమున స్పష్టముగ లేకున్నను పద్మపురాణమునుబట్టి కంబ రామాయణాదులనుబట్టి కవి ఇట్లు పల్కెనని భావింపనగును.

**13) కుశికసుత కథిత విదిత నవ వివిధ కథ!**

కుశికసుత=విశ్వామిత్రమునిచే, కథిత=చెప్పబడిన, విదిత=తెలిసికొనబడిన, నవ= ఇంతకుముందు వినియుండకపోవుటచే కొత్తవైన, వివిధ=అనేకములైన కథ=కథలను కలవాడా!



నీవును, నీ అనుజుడగు లక్ష్మణుడును విశ్వామిత్రమహర్షితో కలిసి పయనించు నపుడు ఆ మహర్షి కాలినడకతో ప్రయాణముచేయు మీకు శ్రమ తెలియకుండుటకై ఇతః పూర్వము మీరు వినని కథలను ఎన్నిటినో చెప్పెను. మన్మథుని వృత్తాంతము, తాటకవధ, వామనావతార వృత్తాంతము, జనకుని వింటికథ, తన పూర్వ పురుషుల కథ, సుబ్రహ్మణ్యస్వామి ఉత్పత్తి, సగరపుత్రుల చరిత్ర మొదలగు అనేక అశ్రుతకథలను ఆ ముని చెప్పగా నీవు ఆసక్తితో వింటివి.

**14) మైథిల నగర సులోచనా లోచన చకోర చంద్ర!**

మైథిల=జనకుని, నగర=నగరమగు మిథిలలోని, సులోచనా=అందమైన కన్నులను గల యువతుల, లోచన=నేత్రములనెడి, చకోర=చకోరపక్షులకు, చంద్ర= చంద్రుని వంటివాడా!

మిథిలానగరమున గల యువతులు నేత్రసౌందర్యమును కలవారు. నిన్ను విశ్వామిత్రముని మిథిలానగర వీథులలో వెంట నిడికొనిపోవునపుడు ఆ యువతులు నీ అందమును దర్శించి మోహమును చెంది, తాము కన్నులను కల్గినందులకు తగిన ఫలమును పొందిరి. వెన్నెలనే జీవనాధారముగా జీవించు చకోరపక్షులకు చంద్రుడు ఆనందము కల్గించు విధమున వారి కన్నులకు నీవు నీ గొప్ప రూపముతో గొప్ప విందును చేకూర్చితివి.

**15) ఖండపరశు కోదండ ప్రకాండ ఖండన శౌండ భుజదండ!**

ఖండపరశు = శివునియొక్క కోదండ ప్రకాండ = గొప్ప విల్లును, ఖండన = విఱుచుటలో, శౌండ = సామర్థ్యమును కల, భుజదండ = బాహుదండములను కలవాడా!

జనకుడు తన కుమార్తెయగు సీతను ఇచ్చి వివాహము చేయుటకు శివుని ధనుస్సును ఎక్కుపెట్టవలెనను నియమమును నిర్ణయించెను. నీవు మిథిలకు చేరిన వెంటనే విశ్వామిత్రుని కోరికను అనుసరించి జనకుడు ఆ వింటిని ఐదువేలమంది వీరుల సహాయముతో సభకు తీసికొని వచ్చునట్లు చేసెను. దానిని నీవు ఎత్తి ఎక్కుపెట్టబోవునపుడు నీ బాహుబలమునకు ఆ విల్లు భగ్నమైనది. ఇట్టి గొప్ప బలిష్ఠములైన బాహువులను కలవాడవు నీవు.

**16) చండకర కిరణ మండల బోధిత పుండరీకవన రుచి లుంఠాక లోచన!**

చండకర = తీవ్రములైన కిరణములను కల సూర్యునియొక్క, కిరణ = కిరణముల, మండల = కూటములచే, బోధిత=వికసించిన, పుండరీకవన = కొంచెము ఎఱుపును కల తెల్లతామరపూల సమూహముల, రుచి = శోభను, లుంఠాక = అపహరించు, లోచన = నేత్రము లను కలవాడా!

నీవు శివధనుస్సు భగ్నము చేయగానే సీతాదేవిని వివాహమాడుటకు వీలు కల్గినది. అందుచే నీ మనస్సున ఆనందము కల్గినది. దానివలన నీ కన్నులు వికసించి, విశాలములై వెలిగినవి. అవి, సూర్యుని కిరణములవలన వికసించిన తామరపూల సమూహముకంటె మిక్కిలి సుందరములై వెలుగొందినవి.

**17) మోచిత జనక హృదయ శంకాతంక!**

మోచిత = విడువబడిన, జనకహృదయ = జనకుని హృదయములోనున్న, శంకా+ఆతంక = సందేహమువలన ఏర్పడిన భయమును కలవాడా! (జనకుని భయమును తీర్చినవాడా!).

“సీతను వివాహమాడుటకు శివుని వింటిని ఎక్కుపెట్టుటను పణముగా పెట్టితినే! శ్రీరాముడు ధనుస్సును ఎక్కుపెట్టకపోయినచో సీతావివాహ మెట్లు జరుగును?” అని చింతను పొందిన జనకుడు తన మనస్సున వ్యాకులపడెను. నీ కరస్పర్శ సోకగానే శివధనుస్సు భగ్నమగుటచే నీవు జనకుని మనస్సుననున్న బాధను తొలగునట్లు చేసితివి.

**18) పరిహృత నిఖిల నరపతి వరణ జనకదుహితృ కుచతట విహరణ సముచిత కరతల!**

పరిహృత = లేకుండ చేయబడిన, నిఖిల నరపతి = సకలప్రభువులయొక్క, వరణ = కోరికలను కలవాడవు, జనక దుహితృ = జనకుని కుమార్తె యగు సీతా దేవి యొక్క, కుచతట = స్తనతటములయందు, విహరణ = విహరించుటలో (క్రీడించుటలో), సముచిత = తగిన, కరతల=చేతులను కలవాడా!

సీతాదేవిని పరిణయమాడగోరి వచ్చిన రాజులకు అందఱకు శివధనుస్సును ఎక్కుపెట్టు శక్తిని లేకపోవుటచే సీతను వివాహము చేసికొనవలెనను వారి మనస్సులలో గల కోరికను వారు మఱచిపోవలసివచ్చెను. ఆ వింటిని నీవు విఱచుటద్వారా జనకుని మనస్సును సంతోషపెట్టి, సీతను వివాహమాడితివి. అందుచే ఆమె స్తనతటములయందు విహరించుటకు నీ కరతలములే యోగ్యములైనవి.

**19) శతకోటి శతగుణ కఠిన పరశుధర మునివర కరధృత దురవనమతమ నిజ ధనురాకర్షణ ప్రకాశిత పారమేష్ఠ్య!**

శతకోటి = వజ్రాయుధముకంటె, శతగుణ = వేయిరెట్లు, కఠిన = కఠినమైనదగు, పరశుధర = గండ్రగొడ్డలిని దాల్చు, మునివర=పరశురాముడను మునిశ్రేష్ఠునియొక్క, కరధృత = చేతులతో దాల్చబడినది, దురవనమతమ=(ఇతరులచే) కొంచెము కూడ వంచుటకు వీలుకానిది అగు, నిజధనుః=తన వింటిను(వైష్ణవ ధనుస్సును), ఆకర్షణ=లాగి, ఎక్కుపెట్టుటవలన, ప్రకాశిత=ప్రకటింపచేయబడిన, పారమేష్ఠ్య= పరమాత్మభావమును కలవాడా!



మిథిలలో జానకిని వివాహమాడి, నీవు బంధువులతో కలసి అయోధ్యకు బయలుదేరినపుడు పరశురాముడు అను ముని తన చేతిలో ఒకానొక వింటిని దాల్చి, ఎదురువచ్చెను. ఆ విల్లు విష్ణువు అగు నీ అంశను కల్గినది. అది ఇంద్రుని వజ్రాయుధము కంటె నూఱురెట్లు కఠినమైనది. ఇతరులకు ఆ వింటిని ఎక్కుపెట్టుటకు సాధ్యము కాదు. ఆ వింటిని ఎక్కుపెట్టుమని పరశురాముడు మిక్కిలి గర్వముతో నిన్ను చూచి పల్కి, దానిని నీకు ఇచ్చెను. నీవు దానిని గ్రహించి అవలీలగా ఎక్కుపెట్టితివి. ఆ ముని గర్వమును పోగొట్టితివి. ఆ అరుదైన కృత్యమును దర్శించిన లోకమంతయు నీవే పరమాత్మవని తెలిసికొన్నది. ఇట్లు నీవు నీ నైజమును లోకమున ప్రకాశింపచేసితివి.

**20) క్రతుహర శిఖరి కంతుక విహృత్యున్ముఖ జగదరుంతుద జిత హరిదంతి దంత దంతుర దశవదన దమన కుశల దశశతభుజముఖ నృపతికుల రుధిర ఝరభరిత పృథుతర తటాక తర్పిత పితృక భృగుపతి సుగతి విహతికర నతపరుడిషుపరిఘ!**

క్రతుహర=దక్షయాగమును ధ్వంసమొనర్చిన శివునియొక్క, శిఖరి=కైలాస పర్వతమును, కంతుక విహృతి=బంతిగా ఆడు ఆటలో, ఉన్ముఖ=ముందుకు వచ్చినవాడు (ఆసక్తిని కలవాడు), జగత్=లోకమునకు, అరుంతుద=గొప్ప బాధను కల్గించువాడు, జిత=జయింపబడిన, హరిదంతి = ఇంద్రుని గజమగు ఐరావతముయొక్క, దంత= దంతములచే, దంతుర=ఎత్తు పల్లములుగానున్న దేహమును కలవాడగు, దశవదన=రావణుని, దమన=అణచుటలో, కుశల=సమర్థములగు, దశశతభుజ ముఖ=వేయి బాహువులను కల కార్తవీర్యార్జునుడు మొదలగు, నృపతి కుల= రాజకులముయొక్క, రుధిర=రక్తముయొక్క, ఝర=ప్రవాహముచే, భరిత = నిండిన, పృథుతర=మిక్కిలి పెద్ద, తటాక=మడుగులో, తర్పిత=తర్పణము చేయ బడిన, పితృక=పితృదేవతలను కలవాడగు, భృగుపతి=పరశురామునియొక్క, సుగతి=సద్గతికి, విహతికర=అడ్డము కలుగజేసిన, నతపరుట్=వంగిన కణుపులను కల, ఇషుపరిఘ= పరిఘవంటి బాణమును కలవాడా!

దక్షప్రజాపతి కుమార్తెయగు సతీదేవి శివుని భార్య. దక్షునకు తన అల్లుడగు శివునిపట్ల ఏదో ఒక కారణమువలన పగ ఏర్పడెను. దక్షుడు తాను చేసిన యజ్ఞములో శివునకు హవిర్భాగము నీయలేదు. తన భర్తకు జరిగిన అవమానమును భరింపలేని సతీదేవి యోగశక్తితో తన ప్రాణమును త్యజించెను. అందులకు తీవ్రమైన కోపమును పొందిన శివుడు దక్షుని యజ్ఞమును ధ్వంసము చేసెను. ఇట్టి శివుడు నివసించు పర్వతము కైలాసము. దీనిని చేతులతో ఎత్తి బంతి ఆడినట్లు రావణుడు ఆడెను.

పూర్వము ఒకానొక సమయమున రావణుడు కుబేరుని జయించి, అతని వద్ద గల పుష్పక విమానమును బలవంతముగా గొని, అందు ఆకాశమున ప్రయాణము చేయుచు వచ్చునపుడు కైలాసపర్వతము సమీపమున పుష్పకవిమానము నిలచిపోయెను.

దానిని చూచిన శివుని కింకరుడగు నంది నవ్వెను. అందుచే రావణుడు మిగుల కోపించి ఆ పర్వతమును చేతులతో ఎత్తి బంతి ఆడినట్లు ఆడెను. లోకమునకు అంతటికి అపుడు ఉపద్రవము ఏర్పడినది. రావణుడు ఇంద్రుని యుద్ధమున జయించినవాడు. ఆ ఇంద్రుని గజమగు ఐరావతము తన దంతములతో రావణుని శరీరములో పొడుచుటచే శరీరమందు కాయలు కాచినవి. అందుచే అతని శరీరము దంతురమై (ఎత్తుపల్లములుగా) ఉండెను. ఇట్టి గొప్ప శక్తిగల రావణుని కూడా యుద్ధమున కార్యవీర్యార్జునుడు జయించెను. అతనికి వేయి బాహువులు కలవు. పరశురాముని తండ్రియగు జమదగ్నిమునిని పూర్వము అతడు వధించెను. దీనివలన కార్యవీర్యార్జునునిపై కోపించిన పరశురాముడు లోకమున క్షత్రియవంశమే లేకుండ చేసెదనని తలచి, కార్యవీర్యార్జునుడు మొదలగు క్షత్రియులతో ఇరువది ఏడుమార్లు యుద్ధ మొనర్చి చంపెను. వారి రక్త ప్రవాహములను మడుగుగా చేసి, అందు తన పితృదేవతలకు తర్పణము చేసెను. ఇట్టి గొప్పతనమును కలవాడు పరశురాముడు.

శ్రీరామచంద్రా! నీవు సీతాదేవిని పెండ్లి చేసికొని, అయోధ్యకు తిరిగి వచ్చునపుడు, శివుని విల్లును నీవు విఱిచితివని విని కోపించిన ఆ పరశురాముడు తన వద్ద గల వైష్ణవధనుస్సును, బాణమును నీకు ఇచ్చి ఎక్కుపెట్టుమని పల్కెను. నీవును అతడు పల్కినట్లే చేసి, అతనిని జయించి, ఆ ముని చిరకాలము ప్రయత్నించి సంపాదించిన, తపఃఫలముగా పొందకోఱియున్న పుణ్యలోకములను పొందుటకు వీలులేనట్లు వానిపై పరిఘవంటి నీ బాణమును ప్రయోగించితివి.

# అయోధ్యాకాండము

**21) అనృతభయ ముషిత హృదయ పితృవచనపాలన ప్రతిజ్ఞావజ్ఞాత యౌవరాజ్య!**

అనృతభయ=అసత్యభయముచే, ముషిత=అపహరింపబడిన, హృదయ= మనస్సును కల, పితృ=తండ్రియొక్క (దశరథుని యొక్క), వచనపాలన=మాటను పాలించుటలో, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞచేయుటచే, అవజ్ఞాత=లెక్కపెట్టని, యౌవరాజ్య= యౌవరాజ్యమును కలవాడా!

నీ తండ్రియగు దశరథుడు కైకేయికి ఇచ్చిన మాట అసత్యమగునను భయముతో తన మనస్సులో గల నిన్ను రాజుగా చేయవలెనను కోఱికను అణచుకొనెను. నిన్ను వనమునకు పొమ్మని పల్కెను. ఆ మాటను నెఱవేర్చుటకై నీవు నీకు ప్రాప్తించిన యౌవరాజ్యాధికారమునుకూడ తృణీకరించితివి.

**22) నిషాదరాజ సౌహృద సూచిత సౌశీల్యసాగర!**

నిషాదరాజ=కిరాతరాజు అగు గుహునిపట్ల గల, సౌహృద=స్నేహముచే, సూచిత= సూచింపబడిన, సౌశీల్యసాగర=సముద్రమువంటి గొప్ప సౌశీల్య గుణమును కలవాడా!



అరణ్యములో సంచరించు వ్యాధ కులమునకు ప్రభువగు గుహుని పట్ల అంతులేని స్నేహమును నీవు కల్గియుంటివి. నిస్సమాభ్యధిక మహిమను కలవాడవు, పరమాత్మవు అగు నీవు మిక్కిలి నీచకులమునకు చెందిన గుహునితో ఎట్టి సంకోచము లేక కలసి, ప్రవర్తించుటచే నీవు సముద్రమువంటి అంతులేని సౌశీల్యగుణమునకు స్థానమైయున్నా వనుట స్పష్టపడుచున్నవి. (సౌశీల్యమనగా మిక్కిలి గొప్పవాడు మిక్కిలి అల్పునితో ఎట్టి సంకోచములేక కలసి వర్తించు గుణము).

**23) భరద్వాజ శాసన పరిగృహీత విచిత్ర చిత్రకూటగిరి కటకతట రమ్యావసథ!**

భరద్వాజ=భరద్వాజమునియొక్క, శాసన=ఆజ్ఞచే, పరిగృహీత=పరిగ్రహించిన (స్వీకరించిన), విచిత్ర=అద్భుతమైన, చిత్రకూటగిరి=చిత్రకూట పర్వతము యొక్క కటకతట=చఱియలలో, రమ్య+ఆవసథ=అందమైన పర్ణశాలను కల్గినవాడా!

గుహుని సహాయముతో గంగను దాటిన నీవు భరద్వాజమునిని దర్శించితివి. ఆ ముని నిన్ను ప్రీతితో ఆదరించి, చిత్రకూట పర్వతప్రాంతమున నివసింపుమని పల్కెను. ఆ మునిమాటను అనుసరించి నీవు అచట లక్ష్మణుని సహాయముతో పర్ణశాలను నిర్మించి, అందు ఆనందముగా కాలమును గడపితివి.

**24) అనన్యశాసనీయ!**

అనన్యశాసనీయ=ఇతరులకు శాసింప సాధ్యము కానివాడా!.

భరతుడు చిత్రకూటమునకు వచ్చి, నీకు నమస్కరించి, అయోధ్యకు తిరిగివచ్చి రాజ్యపాలనమును చేయవలసినదిగా నిన్ను ప్రార్థించెను. వశిష్ఠుడు, జాబాలి మొదలగు మునులను పలు రీతులలో వాదించి, నిన్ను తిరిగి అయోధ్యకు రమ్మని నిర్బంధించి పల్కిరి. నీవు వారి మాటలకు అన్నిటికి తగిన ప్రతిన్యాయములను పల్కి, తిరస్కరించి, వనవాసమును చేయుటకే నిశ్చయించుకొంటివి. అందఱిని ఆజ్ఞాపించువాడవు అగు నీవు ఎవరి శాసనమునకు లొంగువాడవు కావు.

**25) ప్రణత భరత మకుటతట సుఘటిత పాదుకాగ్ర్యాభిషేక నిర్వర్తిత సర్వలోక యోగక్షేమ!**

ప్రణత=శరణు పొందిన, భరత=భరతుని, మకుటతట=కిరీటమునందు, సుఘటిత=చక్కగా పొదగబడిన, పాదుకా+అగ్ర్య=గొప్పపాదుకయొక్క, అభిషేక= పట్టాభిషేకముచే, నిర్వర్తిత=నిర్వహింపబడిన, సర్వలోక=అన్ని లోకములయొక్క, యోగక్షేమ=యోగక్షేమములను కలవాడా!

భరతుడు కులజనులతో, పరివారముతో నిన్ను వెదకికొనుచు చిత్రకూటగిరికి వచ్చెను. నగరమునకు తిరిగివచ్చి, రాజ్యపాలన చేయుమని నిన్ను వేడెను. తండ్రి యగు

దశరథుని మాటయందున్న గౌరవమువలన నగరమునకు తిరిగి వచ్చుటకు నీవు సమ్మతింపలేదు. భరతుడు మరల మరల నిన్ను ప్రార్థింపగా, నీవు అతనిని కరుణించి, ఉన్నతములైన నీ పాదుకలను అతనికి అనుగ్రహించితివి. వానిని అతడు తన తలపై దాల్చి గొనిపోయి, వానికి పట్టాభిషేకము చేసెను. నీవు అయోధ్యకు తిరిగి వచ్చువరకు వానిని చక్రవర్తిగా భావించి, తాను వానికి సేవకునిగా తలచి, రాజ్యమును పాలించెను. ఇట్లు భరతుడు చేసి, సమస్త లోకములకును యోగక్షేమములు రెండును చక్కగా కలుగునట్లు చూచెను.

**26) పిశిత రుచి విహితదురిత వలమథనతనయ బలిభుగనుగతి సరభస శయనతృణశకల పరిపతన భయచకిత సకల సురమునివర బహుమత మహాస్త్రసామర్థ్య!**

పిశిత=మాంసమునందు, రుచి=ఆశచే, విహితదురిత=పాపమును చేసిన, వలమథనతనయ=ఇంద్రుని పుత్రుడగు, బలిభుక్=కాకాసురుని, అనుగతి= అనుసరించుటలో, సరభస=వేగమును కల, శయనతృణశకల=పడుకయందలి దర్భఖండముయొక్క, పరిపతన=క్రిందపడునను, భయచకిత=భయముచే నిశ్చేష్టులైన, సకల=అందఱు, సురమునివర=గొప్పదేవతలచే, మునులచే, బహుమత=గౌరవింపబడిన, మహాస్త్ర సామర్థ్య=బ్రహ్మాస్త్రముయొక్క సామర్థ్యమును కలవాడా!

ఇంద్రకుమారుడగు కాకాసురుడు మాంసమునందలి ఆశచే సీతాదేవిపట్ల గొప్ప అపచారమును చేసెను. అందుచే ఆగ్రహించిన నీవు నీ దర్భశయనము నుండి ఒక దర్భఖండమును తీసి, బ్రహ్మాస్త్రమును అభిమంత్రించి, కాకాసురునిపై ప్రయోగించితివి. భయముతో పరుగెత్తు కాకాసురుని ఆ అస్త్రము వేగముగా వెంబడించి తఱిమినది. దాని వేగమును చూచిన దేవతలు, మునులు అందఱును కాకాసురునకు తాము సహాయపడినచో ఆ అస్త్రము తమపై పడునని భీతిల్లిరి. చిన్నదర్భశకలము బ్రహ్మాస్త్ర రూపమును గొని చేసిన ఈ అద్భుతకృత్యమును వారందఱు పొగడిరి.

**27) ద్రుహిణ హర వలమథన దురాలక్ష్య శర లక్ష్య!**

ద్రుహిణ=బ్రహ్మ, హర=శివుడు, వలమథన=ఇంద్రుడును - అను వీరిచే, దురాలక్ష్య=కాపాడుటకు వీలుకాని, శర=బాణముయొక్క, లక్ష్య=లక్ష్యమును కలవాడా!

కాకాసురుడు తనను బ్రహ్మాస్త్రము తఱుమునపుడు, బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలగు గొప్పదేవతలు అయినను తనను రక్షింతురా! అని వారిని చేరెను. కాని, వారు నీ కోపమునకు లక్ష్యమై, నీ శరమునకు గురి అయిన కాకాసురుని రక్షించుటకు ముందుకు రాలేదు. వానిని కాపాడినచో తమకు ఏమి ఉపద్రవము వాటిల్లునో! అని సందేహించిరి. నీవు ప్రయోగించిన చిన్న దర్భముక్కయొక్క మహిమ ఇట్టిది.



# అరణ్యకాండము

**28) దండకా తపోవన జంగమ పారిజాత!**

దండకా తపోవన=తపస్సును చేసికొనుటకు తగిన దండకారణ్యములో, జంగమ=నడచునట్టి, పారిజాత=పారిజాతవృక్షము వంటివాడా!

నీవు దండకారణ్యమునకు వెడలితివి. అచట గొప్ప తపస్సును చేయునట్టి మునులు, నీవు వచ్చుటను చూచి తాము రాక్షసులవలన బాధలు పడుటను తెలిపి, **"ఏహి పశ్య శరీరాణి"** తమ దేహములను చూపిరి. వారి బాధను విని, చూచిన నీవు వారి కష్టమును పోగొట్టి వారి అభీష్టమును తీర్చితివి. దండకారణ్యమున నీవు అంతట సంచరించి, వారికి మంచిని చేయుటను చూడగా పారిజాతవృక్షమే అచటకు వచ్చి, సంచరించు చున్నదా! ఏమి! అనునట్లుండెను.

**29) విరాధ హరిణ శార్దూల!**

విరాధ=విరాధుడను, హరిణ=లేడికి, శార్దూల=పులివంటివాడా!

నీవు సీతాదేవితో దండకలో సంచరించునపుడు అచటనున్న అందఱికి బాధను కల్గించుచున్న విరాధుడను రాక్షసుడు సీతను పట్టుకొనెను. నీవు వానిపై కోపించి, పులి జింకను అవలీలగా వధించునట్లు, వానిని వధించితివి.

(తుంబురుడను గంధర్వుడు కుబేరునిపట్ల అపచార మొనర్చి, అతని శాపము కారణముగా విరాధుడను రాక్షసుని రూపమును పొందెను. రాముడు అతనిని వధించినపుడు అతనికి శాపవిమోచనము కల్గి, నిజరూపము సిద్ధించెను)

**30) విలులిత బహుఫల మఖకలమ రజనిచర మృగ మృగయారంభ సంభృత చీరభృదనురోధ!**

విలులిత=పాడుచేయబడిన, బహుఫల=అనేకఫలముల నిచ్చు, మఖకలమ= యాగమను సస్యములను కల, రజనిచర=రాక్షసులనెడి, మృగ=జంతువులను, మృగయా+ఆరంభ=వేటాడుటను ప్రారంభించుటచే, సంభృత=సంపాదింపబడిన, చీరభృత్=నారబట్టలను దాల్చు మునులకు, అనురోధ=అనుకూలమైన కృత్యములను చేసినవాడా!

అరణ్యమున నివసించు మునులు అనేకయాగములను చేయుటచే లోకమునకు పలు విధములైన సత్ఫలితములు ఏర్పడును. అట్టి యాగములకు నానారీతులలో అడ్డంకులను కల్గించి, రాక్షసులు వానిని పాడుచేయుచుండిరి. వనమృగములు లోకమునకు మంచిచేయు సస్యములను పాడుచేయుటవంటిదియే రాక్షసులు యజ్ఞములకు విఘ్నములను కల్గించుట. మునులు నీవద్దకు వచ్చి మొఱ పెట్టుకొని, శరణు వేడగా,

నీవు మృగములను వేటాడునట్లు రాక్షసులను వధించుటతో మునులకు ఏర్పడిన అవరోధములు తొలగి, ఆనందము కల్గినది.

**31) త్రిశిరః శిరస్త్రితయ తిమిర నిరాసవాసరకర!**

త్రిశిరః=త్రిశిరుడను రాక్షసునియొక్క, శిరస్త్రితయ=మూడు తలలు అనెడి, తిమిర=చీకటిని, నిరాస=తొలగించుటలో, వాసరకర=సూర్యునివంటివాడా!

నీవు పంచవటిలో నివసించునపుడు నిన్ను మూడు తలలను కల త్రిశిరుడను రాక్షసుడు ఎదిర్చి, యుద్ధమొనర్చెను. లోకమున చీకటి వ్యాపింపగానే ఏ పనియు చేయుటకు వీలుకానట్లే, అతడు కల్గించిన అవరోధములచే మునులు తమ తమ కర్తవ్యములను నిర్వహింప సామర్థ్యము లేనివారై, కలతపడిరి. సూర్యుడు తిమిరమును పోగొట్టునట్లే, నీవు ఆ రాక్షసుని వధించి మునులు తమ తమ కార్యములను ఏ అవరోధము లేకుండ చేయునట్లు వీలు కల్పించితివి.

**32) దూషణ జలనిధి శోషణ తోషిత ఋషిగణ ఘోషిత విజయఘోషణ!**

దూషణ=దూషణుడను రాక్షసుడనెడి, జలనిధి=సముద్రమును, శోషణ= ఎండునట్లు చేయుటతో, తోషిత=సంతోషింపచేయబడిన, ఋషిగణ=మునిసమూహముచే, ఘోషిత=దండోరా వేయబడిన, విజయఘోషణ=జయ జయ శబ్దముల ఘోషను కలవాడా!

పంచవటియందే దూషణుడను వేఱొక రాక్షసుడు నిన్ను ఎదిరించెను. సముద్రమును ఇంకిపోవునట్లు చేయునటుల, వానిని చంపి అపూర్వకృత్యమును చేసితివి. తమకు అడ్డంకులను కల్గించిన రాక్షసుడు నశించుటచే మునులు మిగుల సంతోషించిరి. వారు నీ విజయమును లోకమునందు అంతట ప్రచారమొనర్చి, మంగళాశాసనము చేసిరి.

**33) ఖరతర ఖర తరు ఖండన చండ పవన!**

ఖరతర=మిక్కిలి కఠినుడైన, ఖర=ఖరుడను, తరు=వృక్షమును, ఖండన= విరుచుటలో, చండపవన=పెనుగాలివంటివాడా!

ఖరుడను రాక్షసుడు మిక్కిలి క్రూరుడు. అతడు నీతో పోరాడెను. చండమారుతము వృక్షమును విఱుచునట్లు నీవు అతనిని చంపి కూలగొట్టితివి.

**34) ద్విసప్త రక్షః సహస్ర నలవన విలోలన మహాకలభ!**

ద్విసప్త=పదు నాల్గు, రక్షః సహస్ర=వేల రాక్షసులనెడి, నలవన=రెల్లు వనమును, విలోలన=కకావికలు కావించుటలో, మహాకలభ=గొప్ప గున్నఏనుగు వంటివాడా!

ముందు తెలుపబడిన త్రిశిరుడు, దూషణుడు, ఖరుడను ముగ్గురు రాక్షసుల తోపాటు, పదునాల్గువేలమంది రాక్షసులు నిన్ను ఎదురించి, పోరు సల్పిరి. అపుడు నీవు,



రెల్లువనమును ఒక గొప్ప ఏనుగు ధ్వంసము చేయునట్లు, వారిని అందఱను శీఘ్రముగా ధ్వంసము చేసితివి.

**35) అసహాయశూర!**

అసహాయశూర=వేఱొక సహాయము అక్కఱలేని గొప్ప వీరుడా!

ఇంతమంది రాక్షసులను జయించుటకుకూడా నీకు వేఱెవ్వరి సహాయము అవసరము కాలేదు. కావున సాటి లేని మేటి వీరుడవు నీవు.

**36) అనపాయసాహస!**

అనపాయసాహస=ఎట్టిలోపములేని సాహసమును కలవాడా!

ఇంతమంది రాక్షసులతో ఒక్కడవే పోరు సలుపుట మిక్కిలి అరుదైన కార్యము. ఇది వేఱొకరు ఎవ్వరును చేయలేనిది. నీవు చేసిన ఈ అపూర్వకార్యము ఎట్టి ఆటంకము లేకుండ విజయము నందినది.

**37) మహిత మహామృథ దర్శన ముదిత మైథిలీ దృఢతర పరిరంభణ విభవ విరోపిత వికట వీరవ్రణ!**

మహిత=గొప్ప (పొగడబడిన), మహామృథ=మహాయుద్ధమును, దర్శన= చూచుటచే, ముదిత=సంతోషించిన, మైథిలీ=సీతాదేవియొక్క, దృఢతర=మిక్కిలి గాఢమైన, పరిరంభణ=కౌగిలింతలోని, విభవ=గొప్పతనముచే, విరోపిత=చికిత్స చేయబడిన, వికట=గొప్ప, వీరవ్రణ=వీర్యసాక్ష్యములగు వ్రణములను కలవాడా!

నీవు జనస్థానములో అనేక వేలమంది రాక్షసులతో ఎదిరించి నిలచి, ఎట్టి భయము లేక పోరు సల్పి, విజయము నందితివి. దేవతలు, మునులు అందఱు గొప్ప విస్మయముతో ఆ యుద్ధమును తిలకించి, నిన్ను పొగడిరి. సీతాదేవి తన కన్నులతో ఆ పోరును చూచి, నీ వీర్యమును తెలిసికొని, మిక్కిలి సంతోషపడినది. ఆమెకు కల్గిన ఆనందము లోపల ఇముడకపోవుటచే, ఆమె స్వయముగా వచ్చి నిన్ను మిక్కిలి గాఢముగా కౌగలించుకొన్నది. నీ వక్షఃస్థలములో రాక్షసులు ప్రయోగించిన బాణములవలన ఏర్పడిన గాయములు అన్నియు నీ వీరమును నిరూపించుచున్నవి. సీతాదేవి నీకు బహుమానముగా ఇచ్చిన గాఢాలింగనము ఆ గాయములను అన్నిటిని మాన్పినది.

**38) మారీచ మాయామృగ చర్మ పరికర్మిత నిర్భర దర్భాస్తరణ!**

మారీచ మాయామృగ=కపట మృగరూపమును దాల్చిన మారీచునియొక్క, చర్మ= తోలుతో, పరికర్మిత=అలంకరింపబడిన, నిర్భర=పూర్ణమైన, దర్భ+ ఆస్తరణ= దర్భాసనమును కలవాడా!

రావణుడు సీతను వంచనతో అపహరింపనెంచి, మారీచుని మాయామృగము రూపమును దాల్చి, ఆమె సమీపమున సంచరింపుమని నిర్బంధించెను. మారీచుడును ఎట్టకేలకు అందులకు అంగీకరించి, తన మాయాశక్తితో మాయా మృగరూపమును సృష్టించి, అందు తాను ప్రవేశించి, సీతాదేవి సమీపమున తిరిగెను. ఆ మృగమును పట్టి తీసికొని రమ్మని సీతాదేవి నిన్ను కోఅగా, నీవును ఆ మృగమును చాల దూరము వెంబడించి, చివరకు దానిని వధించితివి. దాని చర్మమును కొనివచ్చి, నీవు ఉపయోగించు దర్భాసనమునకు అలంకారము కావించితివి. దానివలన నీ దర్భాసనమునకు అందము చేకూరినది.

### 39) విక్రమ యశోలాభ విక్రీత జీవిత గృధ్రరాజ దేహ దిధక్షా లక్షిత భక్త జన దాక్షిణ్యా!

విక్రమ=విక్రమమును చూపుటచే, యశోలాభ=కీర్తిని పొందుటకొఅకు, విక్రీత=విక్రయింపబడిన, జీవిత=ప్రాణములను కల, గృధ్రరాజ=జటాయువుయొక్క, దేహ=శరీరమును, దిధక్షా=దహనముచేయు (అగ్ని సంస్కారము చేయు) కోతికచే, లక్షిత=చూపబడిన, భక్తజన=భక్తుల విషయమున గల, దాక్షిణ్యా= ఆనుకూల్యమును కలవాడా!

రావణుడు సీతను అపహరించుకొనిపోవునపుడు జటాయువు అను గృధ్రరాజు రావణునితో తనకు శక్తియున్నంతవరకు పోరాడి అతనిని నిలువరించెను. చివరకు రావణుడు జటాయువు ఱెక్కలను ఖండించి, నేలగూల్చెను. నీవు లక్ష్మణునితోపాటు సీతాదేవిని వెదకునపుడు నీకు సీతాపహరణవృత్తాంతమును చెప్పి జటాయువు ప్రాణములను విడచెను. ఇట్లు సీతాదేవికొఅకు ప్రాణములను విడచిన దానికి ఫలముగా ఏనాటికిని నశింపని వీరకీర్తిని జటాయువు పొందెను. పరమభాగవతుడగు జటాయువు శరీరమునకు అనుష్ఠానపరులగు బ్రహ్మవేత్తలకు శాస్త్రప్రకారము చేయు అగ్ని సంస్కారమును చేయగోరి, నీవు నీ చేతులతో ఆ సంస్కారమును చేసితివి. నీ తండ్రియగు దశరథచక్రవర్తికి లభింపని ఆ లాభము జటాయువుకు దక్కినది. దీనివలన నీ భక్తులపట్ల నీకు ఎట్టి ప్రేమ కలదో, గౌరవము కలదో వ్యక్తమగుచున్నది.

### 40) కల్పిత విబుధభావ కబంధాభినందితా!

కల్పిత=పొందించిన, విబుధభావ=దేవభావమును కల (దేవస్వరూపమును కల), కబంధ=కబంధునిచే, అభినందిత=పొగడబడినవాడా!

కబంధుడను రాక్షసునకు కంఠమునకు క్రిందనుండు దేహముమాత్రమే వెలుపల ఉండెను. కంఠము వక్షఃస్థలములో దిగబడియుండెను. ఇంద్రునిపట్ల అపచారము చేసిన ఒక దేవతకు ఇంద్రుని వజ్రాయుధ ప్రయోగముచే ఇట్టి కబంధరూపము ఏర్పడినది. స్థూలశిరస్సు అను మునిశాపముచే అతడు అట్టి రాక్షసరూపమును పొందెను. అతడు సీతను వెదకుడు వచ్చి నిన్ను ఎదిర్చెను. నీవు అతనిని చంపి, గుంటలో పడవేసి, దహనము చేసితివి. అతడు తన శాపము తీరి, దివ్యరూపమును పొంది స్వర్గమును చేరెను. నీవలన తన శాపము పోవుటచే ఆనందించిన కబంధుడు నీ మహిమను ప్రస్తుతించి, సుగ్రీవునితో నీవు స్నేహము చేయుట, సీతను అన్వేషించి, తీసికొని వచ్చుటకు ఉపకరించుమని పల్కెను.



### 41) అవంధ్య మహిమ మునిజన భజన ముషిత హృదయ కలుష శబరీ మోక్ష సాక్షిభూత!

అవంధ్య=నిష్ఫలము కాని, మహిమ=గొప్పతనమును కల, మునిజన= మునుల సమూహమును, భజన=సేవించుటచే, ముషిత=అపహరింపబడిన, హృదయ కలుష=హృదయమునందలి దోషమును కల్గినదగు, శబరీ=శబరియొక్క, మోక్ష= మోక్షమునకు, సాక్షిభూత=సాక్షియైయున్నవాడా!

శబరియను వృద్ధవనిత జ్ఞానసంపన్నులగు పలువురు మునులను సేవించినది. ఆ మునులు తాము తలచిన కార్యమును పూర్తిచేయగల సమర్థులు. అట్టి మునులను సేవించినందున శబరి మనస్సులోనున్న కాలుష్యమంతయు తొలగినది. ఆమె తన పూర్వజన్మలో ప్రారంభించిన భక్తియోగమును ఈ జన్మలో ఆచరించి, పూర్తిచేసెను. ఆమె తన యోగమునకు లక్ష్యభూతుడవు అగు నిన్ను దర్శించి, నీ కృపను పొంది, నీ కంటి ఎదుటే మోక్షమును పొందెను.

## కిష్కింధాకాండము

### 42) ప్రభంజనతనయ భావుక భాషిత రంజిత హృదయ!

ప్రభంజనతనయ=వాయుపుత్రుడైన హనుమంతునియొక్క, భావుక= మంగళమైన, భాషిత=మాటలచే, రంజిత=సంతోషింపచేయబడిన, హృదయ= మనస్సును కలవాడా!

కబంధుని మాటలను విని, సుగ్రీవుని కలియుటకై బయలుదేరి, పంపానది తీరమున నీవు, నీ తమ్ముడగు అనుజుడును వెదకుచుండగా, మిమ్ములను చూచి భీతిల్లిన సుగ్రీవుడు హనుమంతుని మీ వద్దకు పంపెను. హనుమంతుడు మిక్కిలి సముచితముగా మాట్లాడి మీ మనస్సులను సంతోషపెట్టెను. అతని మాటలకు విస్మయపడిన నీవు హనుమంతుని ప్రశంసించితివి.

### 43) తరణిసుత శరణాగతి పరతంత్రీకృత స్వాతంత్ర్య!

తరణిసుత=సూర్యపుత్రుడైన సుగ్రీవునిపట్ల నీవు చేసిన, శరణాగతి= శరణాగతిచే, పరతంత్రీకృత=పరతంత్రము చేయబడిన, స్వాతంత్ర్య=స్వాతంత్ర్యమును కలవాడా!

రావణుని అధీనమునుండి సీతను విడిపించుట కొఱకు సుగ్రీవుని సహాయముగా వెదకి స్నేహము చేసి, అతని సహాయమును అభ్యర్థించితివి. దానిచే సర్వేశ్వరుడవగు నీ స్వాతంత్ర్యమును విడచి, సుగ్రీవుని ఆజ్ఞకు లోబడునట్లు సులభుడవైతివి.

**44) దృఢ ఘటిత కైలాసకోటి వికట దుందుభి కంకాళకూట దూరవిక్షేప దక్ష దక్షిణేతర పాదాంగుష్ఠ దరచలన విశ్వస్త సుహృదాశయ!**

దృఢ ఘటిత=బిగువుగా పట్టుకొనబడిన, కైలాసకోటి=కైలాసపర్వతముయొక్క శిఖరమువలె, వికట=గొప్ప శరీరమును కల, దుందుభి=దుందుభి అను అసురునియొక్క, కంకాళకూట=ఎముకల గుట్టను, దూరవిక్షేప=బహుదూరము విసరివేయుటలో, దక్ష=సమర్థమైన, దక్షిణ+ఇతర=ఎడమవైపు గల, పాద+ అంగుష్ఠ=పాదము బొటన వేలును, దరచలన=కొంచెము కదుపుట ద్వారా, విశ్వస్త=నమ్మకమును కలవానినిగా చేయబడిన, సుహృత్+ఆశయ=స్నేహితుడగు సుగ్రీవుని హృదయమును కలవాడా!

సుగ్రీవుని తన అన్న అగు వాలిని స్మరించి "నీవు అతనిని జయింపగలవా?" అని సంశయించెను. అతనికి విశ్వాసమును కల్గించుట అపుడు నీకు అవసరమయ్యెను. అందులకై ఒక అరుదైన పనిని చేసితివి. దుందుభి అను రాక్షసుడు కైలాసపర్వత శిఖరములన్నిటిని ఒకటి చేర్చినట్లున్న గొప్పశరీరమును కలవాడు. అతడు ఒకప్పుడు వాలిని ఎదిర్చెను. వాలి అతనిని వధించెను. దుందుభి పెద్ద దేహమునందున్న ఎముకల పోగు మిక్కిలి పెద్దది. నీ ఎడమపాదములోని బొటనవేలును కొంచెము కదిపి ఆ అస్థిసంచయమును కడుదూరముగా పడునట్లు చేసితివి. వేఱెవ్వరివలనను తలచుటకు కూడ సాధ్యముకాని ఆ అపూర్వమైన కార్యమును చూచి నీపట్ల గొప్ప నమ్మకమును సుగ్రీవుడు పొందెను. ఇట్లు నీవు నీ స్నేహితుడగు సుగ్రీవుని నిన్ను నమ్మునట్లు చేసితివి.

**45) అతిపృథుల బహువిటపి గిరి ధరణి వివర యుగపదుదయ వివృత చిత్రపుంఖ వైచిత్ర్య!**

అతిపృథుల=మిక్కిలి పెద్దవి అయిన, బహువిటపి=పలు వృక్షములు, గిరి= పర్వతములు, ధరణి=భూమి, వివర=పాతాళము అను వీనియందు, యుగపత్+ ఉదయ=ఒకే సమయములో ప్రవేశించుటచే, వివృత=స్పష్టపడిన, చిత్రపుంఖ= విచిత్రమైన పుంఖమును (పిడిని) కల బాణములయొక్క, వైచిత్ర్య=ఆశ్చర్యకరమైన లీలను కలవాడా!

దుందుభి ఎముకల ప్రోగును నీవు కడుదూరము చిమ్ముటవలన నీ దేహశక్తిని సుగ్రీవుడు గ్రహించెను. కాని దానితో అతడు పూర్తిగా తృప్తిపడలేదు. బాణప్రయోగములో నీకున్న సామర్థ్యమునుకూడ పరీక్షింపగోరెను. అతడున్నచోట ఏడు సాలవృక్షము లుండెను. వానిని బాణముతో పడగొట్టుమని అతడు నిన్ను కోరెను. నీవును అతడు కోరినట్లే విచిత్రమైన పిడిని కల్గిన బాణములను ప్రయోగించితివి. అపుడు అవి ఒక్క క్షణములో



ఆ ఏడు సాలవృక్షములను ఛేదించుటయే గాక, పర్వతములను బ్రద్దలుచేసి, భూమియందు ప్రవేశించి పగులగొట్టి, పాతాళలోకమువరకు పోయి తిరిగి నీ అంబులపొదిని చేరినవి. ఈ అత్యద్భుతచేష్టితమును ఎచటనైనను చూడ అసాధ్యము. ఈ ఆశ్చర్యకర కృత్యమును చూచిన సుగ్రీవుడు నీయందు పూర్తి నమ్మకమును పొందెను.

**46) విపుల భుజశైలమూల నిబిడ నిపీడిత రావణ రణ రణక జనక చతురుదధి విహరణ చతుర కపి కులపతి హృదయ విశాల శిలాతల దారణ దారుణ శిలీముఖ!**

విపుల=విశాలమైన, భుజశైలమూల=పర్వతమువంటి భుజముల మూలము లందు, నిబిడ=గాఢముగా నొక్కి, నిపీడిత=బాధింపబడిన, రావణ= రావణునకు, రణ రణక జనక=గొప్పభయమును కల్గించిన, చతురుదధి=నాల్గు సముద్రములందును, విహరణ=క్రీడించుటలో, చతుర=సమర్థుడగు, కపి కులపతి =వానర ప్రభువగు వాలియొక్క, హృదయ=గుండె అను, విశాల శిలాతల=విశాల మైన శిలాతలమును, దారణ=బ్రద్దలు చేయుటలో, దారుణ=కఠినమైన, శిలీముఖ =బాణమును కలవాడా!

వాలికి నాల్గు సముద్రముల వద్దకుపోయి సంధ్యావందనమును చేయుట అలవాటు. అతడు ఒకానొక సమయమున పూర్వసముద్రతీరమున అర్ఘ్యము నిచ్చునపుడు అచటకు వచ్చిన రావణుడు బలగర్వముతో పర్వతశిఖరములవలె విశాలములైన వాలి బాహువుల నడుమ చేతులను పెట్టి అతనిని బంధింపజూచెను. వాలి దానిని గమనించి తన బాహువులమధ్య అతని చేతులను గట్టిగా నొక్కిపట్టి, అతనిని తాను చూడనట్లు నటించి, మిగిలిన సముద్రములవద్దకుకూడ పోయి సంధ్యావందనమును ముగించుకొని దక్షిణ సముద్రతీరమునకు వచ్చి ఆ పిమ్మట విడచిపెట్టెను. ఇట్లు వాలి చేసిన పనికి రావణుడు భయపడెను. ఇట్టి సాటిలేని బలమును కల్గిన వాలియొక్క శిలాఫలకమువంటి విశాలమైన వక్షఃస్థలమును నీవు కఠినమైన బాణములతో అనాయాసముగా ఛేదించితివి. నీ బలమునకు అవధికలదా!

## సుందరకాండము

**47) అపార పారావార పరిఖా పరివృత పరపుర పరిసృత దవదహన జవన పవనభవ కపివర పరిష్వంగ భావిత సర్వస్వదాన!**

అపార=ఒడ్డు లేని, పారావార=సముద్రము అను, పరిఖా=అగడ్తచే, పరివృత = చుట్టబడియున్న, పరపుర=శత్రువగు రావణుని నగరమగు లంకలో, పరిసృత= అంటించిన, దవదహన=దావాగ్నినికలవాడై, జవన=మిక్కిలి వేగమునుకలవాడైన, పవనభవ=వాయుపుత్రుడగు, కపివర=హనుమంతుని, పరిష్వంగ=కౌగలించుకొనుటచే,

భావిత=సంభావింపబడిన, సర్వస్వదాన=సమస్తమైన ఐశ్వర్యమును అనుగ్రహించుటను కలవాడా! (సకలైశ్వర్యప్రదానమును కలవాడా!).

అపారమైన సముద్రము రావణుని నగరమగు లంకలోనికి శత్రువులు ప్రవేశించుటకు వీలులేనట్లు రక్షించు అగడ్తవలె ఉండెను. హనుమంతుడు ఆ సముద్రమునుకూడ దాటి లంకలోనికి ప్రవేశించి, సీత జాడను తెలిసికొనెను. లంకలోని రాక్షసులు హనుమానునకు బాధను కల్గించుటకై అతని తోకకు నిప్పు పెట్టిరి. ఆ అగ్నితోనే అతడు లంకను మొత్తము దగ్ధము కావించెను. సీతను కలిసి, ఆమెతో మాటలాడి, నీ విచ్చిన అంగుళీయకమును ఆమెకు అందజేసి, ఆమె వృత్తాంతమును నీకు తెలియజేసెను. అందుచే నీకు కల్గిన గొప్ప ఆనందము కారణముగా నీవు హనుమానుని గాఢముగా కౌగలించుకొంటివి. అట్లు చేయుటద్వారా నీవు నీ సర్వస్వమును అంతటిని అతనికి ఇచ్చితివి అను భావమును ప్రకటించితివి.

# యుద్ధకాండము

**48) అహిత సహోదర రక్షః పరిగ్రహ విసంవాది వివిధ సచివ విస్రంభణ సమయ సంరంభ సముజ్జృంభిత సర్వేశ్వరభావ!**

అహిత=శత్రువు అగు రావణునియొక్క, సహోదర=తమ్ముడగు, రక్షః= రాక్షసుడగు విభీషణుని, పరిగ్రహ=స్వీకరించుటలో విసంవాది=ఆక్షేపమును చేయు, వివిధ=పలు రీతుల అభిప్రాయములను తెలియబఱచిన సచివ=మంత్రులకు, విస్రంభణ సమయ=నమ్మికను కల్గించు సమయములోని, సంరంభ=తొందరవలన, సముజ్జృంభిత= స్పష్టముగా వ్యక్తమైన, సర్వేశ్వరభావ=సర్వేశ్వరత్వమును కలవాడా!

నీ హనుమానునిద్వారా సీత ఉన్న జాడను తెలిసికొని, ఆమెను తిరిగి తీసికొని వచ్చుటకై వానరసేనను గొని, సముద్రతీరమును చేరితివి. అపుడు శత్రువగు రావణుని యొక్క అనుజుడగు విభీషణుడు తన అన్నకు అనేక సదుపదేశములను చేసెను. కాని, అతడు వానిని పెడచెవిని పెట్టుటచే విభీషణుడు వానిని విడచి, నీ పాదసన్నిధిలో శరణాగతి చేయగోరి వచ్చెను. అతనిని స్వీకరింపనెంచిన నీవు, వానరవీరుల అభిప్రాయమును తెలిసికొనదలచి, వారిని ప్రశ్నించితివి. హనుమంతుడు తప్ప మిగిలిన వానరవీరులందఱు విభీషణుని అంగీకరింపరాదనియే పల్కిరి. అందులకు ఒక్కొక్కరు ఒక్కొక్క కారణమును పల్కిరి. అపుడు వారికి విభీషణునిపట్ల నమ్మకము కుదురుటకై మిక్కిలి శ్రమపడి, పలు విషయములను వారికి తెలిపితివి. విభీషణునివలన నీకు ఆపద మూడునో, ఏమో! అని భయపడిన వానరవీరులకు నిన్ను ఎవడును కొంచెము కూడ బాధింపలేడనుటకు నీవు అనేకవిధములైన, నీ గొప్పతనములను వివరించి, నీ సర్వేశ్వరత్వమును వ్యక్తము చేసితివి.



**49) సకృత్ ప్రపన్నజన సంరక్షణ దీక్షిత!**

సకృత్=ఒకమాఱు, ప్రపన్నజన=శరణు వేడినవానిని, సంరక్షణ= కాపాడుటలో, దీక్షిత=దీక్షను కలవాడా!

నిన్ను ఒకసారి శరణు వేడినవానికి ఎవరివలనను భయము రాకుండునట్లు కాపాడుటయే నీకు నిజమైన వ్రతమనుటను లోకమున తెలియునట్లు చేసితివి.

**50) వీర!**

వీర=గొప్ప వీర్యగుణమును కలవాడా!

శరణుగోరినవానికి ఎట్టి భయము రాకుండ కాపాడు వీర్యమును నీవద్ద తప్ప వేఱెవ్వరివద్ద చూడగలము?

**51) సత్యవ్రత!**

సత్యవ్రత=నీ వ్రతమును తప్పక నెఱవేర్చువాడా!

ఒక పర్యాయము శరణుపొందినవారిని కాపాడుటయే నీ వ్రతముగా పల్కి, ఆ విధముగా శరణుపొందిన విభీషణుని మొదట ఆక్షేపించిన సుగ్రీవుని పురస్కరించుకొని, ఆ విభీషణుని పిలిచి, సముద్ర తీరముననే అభయమిచ్చి కాపాడుటయే కాక, లక్ష్మణుని గొని విభీషణునకు రాజ్యాభిషేకము చేసితివి.

**52) ప్రతిశయన భూమికా భూషిత పయోధిపులిన!**

ప్రతిశయన=ప్రాయోపవేశము అను శయనమునకు తగిన, భూమికా= వేషముతో, భూషిత=అలంకరింపబడిన, పయోధిపులిన=సముద్రతీరములోని ఇసుకతిన్నెను కలవాడా!

సముద్రమును దాటు ఉపాయ మేమి? అని చింతించునపుడు విభీషణుడు సముద్రుని శరణాగతి చేసినచో, సముద్రతరణము చేయవచ్చుననెను. దానికి నీవు సమ్మతించి, సముద్రతీరమున ఇసుకతిన్నెలో దర్భలను పఱచి,నీ భుజమును తలదిండుగా చేసికొని, తూర్పుముఖముగా సముద్రునిగూర్చి చేతులను జోడించి నమస్కరించుచు పరుండితివి. (తలచిన కార్యము సఫలమగువరకు ఇట్లు శయనించియుండుటకు ప్రాయోపవేశమని పేరు) నిజమునకు నీ విట్లు ప్రాయోపవేశమును చేయవలెనా? నీ వట్లు పరుండియున్న సన్నివేశము సముద్రతీరమున కంతటికిని శోభను చేకూర్చినది.

**53) ప్రళయ శిఖి పరుష విశిఖ శిఖా శోషితాకూపార వారిపూర!**

ప్రళయ=ప్రళయకాలములోని, శిఖి=అగ్నివలె, పరుష=భయంకరమైన, విశిఖ=బాణముయొక్క, శిఖా=జ్వాలచే, శోషిత=ఇంకినట్లు చేయబడిన, అకూపార = సముద్రముయొక్క, వారిపూర=నీటిప్రవాహమును కల్గినవాడా!

నీవు చేసిన శరణాగతియొక్క గొప్పతనమును తెలియని సముద్రుడు నీ ప్రయత్నమును సఫలము చేయలేదు. నీ కపుడు తీవ్రమైన కోపము కల్గినది. తీవ్రములైన బాణములను సముద్రునిపై ప్రయోగించితివి. నీ బాణములు ప్రళయకాలములోని అగ్నివలె మిక్కిలి భయంకరములైనవి. వాని జ్వాలలు సముద్రమునందు వ్యాపించి, అందలి నీటిప్రవాహమును ఆవిరి అగునట్లు చేసినవి. ఆ పిమ్మటకూడ సముద్రుడు నీ వద్దకు రాలేదు. ఎంతటి గర్వము సముద్రునిది! అపుడు నీవు బ్రహ్మాస్త్రమును ప్రయోగింప ప్రయత్నించితివి. సముద్రుడు తనలోని జలమంతయు ఇంకిపోవునని భయపడెను. వెంటనే పరుగెత్తి వచ్చి నిన్ను క్షమాపణ వేడెను. నీకు కోపము వచ్చినచో లోకము తాళగలదా!

**54) ప్రబల రిపు కలహ కుతుక చటుల కపికుల కరతల తూలిత హృత గిరి నికర సాధిత సేతుపథసీమా సీమంతిత సముద్ర!**

ప్రబల=మిక్కిలి బలమును కల, రిపు=శత్రువులతో, కలహ=యుద్ధము చేయుటలో, కుతుక=ఆసక్తిచే, చటుల=వేగమును పొందిన, కపికుల=వానరసమూహముయొక్క, కరతల=చేతులతో, తూలిత=దూదివలె మోసి, హృత=తీసికొనిరాబడిన, గిరినికర=పర్వత సమూహముచే, సాధిత=కట్టబడిన, సేతుపథసీమా =ఆనకట్టసీమచే, సీమంతిత=పాపిడి కల్గినదిగా చేయబడిన, సముద్ర= సముద్రమును కలవాడా!

సముద్రుడు తనపై ఆనకట్టను కట్టుటకు చోటును ఇచ్చెను. వానరసైన్యము రావణుడు మొదలగు గొప్ప వీరులతో యుద్ధముచేయవలెనను అధికమైన ఉత్సాహముతో నుండెను. పత్తిని మోయునట్లు ఏ మాత్రము శ్రమను పొందక వానరులు పర్వతములను తీసికొనివచ్చుట చాల అద్భుతము. వానిని కొనివచ్చి సముద్రములో పడవేసి ఆనకట్టను కట్టించితివి. ఇట్లు నీటితో నిండిన సముద్రముపై వారధిని కట్టి వానరసేన ఆ సముద్రమును రెండుగా విభజించి, ఆ ఆనకట్టద్వారా సముద్రమును దాటినది. ఆ ఆనకట్ట సముద్రమునకు పాపిడివలె తోచినది.

**55) ద్రుతగతి తరుమృగ వరూథినీ నిరుద్ధ లంకావరోధ వేపథు లాస్య లీలోపదేశ దేశిక ధనుర్జ్యాఘోష!**

ద్రుతగతి=వేగమైన మనమును కల్గిన, తరుమృగ=వానరముల, వరూథినీ =సేనచే, నిరుద్ధ=అడ్డగింపబడిన, లంకా=లంకలోని, అవరోధ=అంతఃపురస్త్రీల, వేపథు= దేహకంపము అను, లాస్యలీలా=నటనావిలాసమును, ఉపదేశ= బోధించు, దేశిక= ఆచార్యునిగానున్న, ధనుఃజ్యాఘోష=వింటినారియొక్క శబ్దమును కలవాడా!

ఆనకట్టను కట్టిన వెంటనే వానరసైన్యము మిక్కిలి వేగముతో లంకను చేరి ముట్టడించినది. పిమ్మట నీవు వింటిని ఎక్కుపెట్టి, నారిని మోగించితివి. ఆ ధ్వని లంకలోని అంతఃపుర స్త్రీలకు దేహకంపమును కల్గించినది. భయముతో వారి దేహము కదలాడునపుడు వీరు నాట్యమును చేయుచున్నారా? అని తోచినది. అట్టి నాట్యమును నేర్పించు ఆచార్యునివలె నీ వింటి జ్యాఘోష యుండెను.



**56) గగనచర కనకగిరి గరిమధర నిగమమయ నిజగరుడ గరుదనిలలవ గళిత విషవదన శరకదన!**

గగనచర=ఆకాశమున సంచరించు, కనకగిరి=మేరుపర్వతముయొక్క, గరిమధర= గొప్పతనమును పొందినవై, నిగమమయ=వేదస్వరూపములైయున్న, నిజగరుడ= తనస్నేహితుడైన గరుడునియొక్క, గరుత్=ఱెక్కల, అనిలలవ=పిల్లగాలిచే, గళిత=జారిన, విషవదన=విషమును ముఖము (అగ్రభాగము) నందు కల, శరకదన=నాగాస్త్రములవలన ఏర్పడిన బాధను కలవాడా!

లంకలో సంభవించిన యుద్ధములో అంగదునితో తలవడి ఓడిపోయి, రథమును సారథిని కోల్పోయిన ఇంద్రజిత్తు అదృశ్యుడై, నిన్ను, అనుజుడగు లక్ష్మణుని నాగాస్త్రముతో కట్టి, మీరు మూర్ఛిల్లునట్లు చేసెను. నాగాస్త్రములు విషమును వెడలగ్రక్కుచుండెను. అపుడు సహజముగా బంగారు రంగును కలవాడు, నీకు వాహనము, వేదస్వరూపుడు అగు గరుడుడు "మేరు పర్వతమే ఆకాశమున ఎగిరి వచ్చుచున్నదా?" అనునట్లు ఎగిరి వచ్చెను. అతని ఱెక్కల గాలి ఇంచుక సోకినంతనే నాగాస్త్రముల శక్తి సమూలముగా నశించెను. నాగములు పారిపోయినవి.

**57) అకృతచర వనచర రణకరణ వైలక్ష్య కూణితాక్ష బహువిధ రక్షోబలాధ్యక్ష వక్షః కవాట పాటన పటిమ సాటోప కోపావలేప!**

అకృతచర=ఇంతకు ముందెన్నడు చేయబడని, వనచర=వానరులతో, రణకరణ=యుద్ధముచేయుటచే ఏర్పడిన, వైలక్ష్య=సిగ్గుచే, కూణిత+అక్ష=కన్నులు మూసిన, బహువిధ=పలు విధములైన, రక్షోబల=రాక్షస సైన్యముల, అధ్యక్ష= నాయకుల, వక్షః కవాట=కవాటమువంటి వక్షఃస్థలములను, పాటన=పగుల గొట్టుటలో, పటిమ=సామర్థ్యముచే, సాటోప=ఆడంబరముతో కూడిన, కోప+ అవలేప=కోపమును, గర్వమును కలవాడా!

పిమ్మట వానరసేనకు, రాక్షస సైన్యమునకు మధ్య పోరు సంభవించినది. అంతవరకు అట్టి యుద్ధమెప్పుడును జరుగలేదు. వానరులను చాల తక్కువగా తలచువారు రాక్షసులు. అట్టి వానరులతో యుద్ధము చేయవలసి వచ్చుటచే, వారు సిగ్గుతో కన్నులను మూసికొనిరి. ఇట్టి రాక్షససేనల ప్రవర్తనచే నీకు వారిపట్ల తీవ్రమైన కోపము, నీ బలిమిచే గర్వమును కల్గినవి. దానివలన ఏమయినది? పలువిధములైన రాక్షససేనల నాయకుల కవాటము వంటి విశాలమైన వక్షఃస్థలములు బ్రద్దలైనవి.

**58) కటు రటద్ అటని టంకృతి చటుల కఠోర కార్ముక వినిర్గత విశంకట విశిఖ వితాడన విఘటిత మకుట విహ్వల విశ్రవస్తనయ విశ్రమసమయ విశ్రాణన విఖ్యాత విక్రమ!**

కటు=కఠినముగా, రటద్=శబ్దముచేయుచున్న, అటని=మొన నుండి పుట్టిన టంకృతి=టంకార ధ్వనిచే, చటుల=మధురమైనదై, కఠోర=కటువైనదగు, కార్ముక =వింటి నుండి, వినిర్గత=బయల్వెడలిన, విశంకట=కఠినమైన, విశిఖ=బాణముయొక్క, వితాడన=దెబ్బచే, విఘటిత=బ్రద్దలు చేయబడిన, మకుట=కిరీటమును కల్గినవాడై, విహ్వల=కలతచెందినవాడగు, విశ్రవస్తనయ=విశ్రవసుయొక్క కుమారుడగు రావణునకు, విశ్రమసమయ=విశ్రాంతిసమయమును, విశ్రాణన= దానముచేయుటచే, విఖ్యాత= ప్రసిద్ధమైన, విక్రమ=వీర్యగుణమును కలవాడా!

నీ వింటి అగ్రభాగమునుండి వెలువడు టంకార ధ్వని చెవికి తీయనిదై యున్నను, శత్రువులకు మిక్కిలి భయమును కల్గించును. ఇట్టి వింటిని చేతిలో దాల్చి, నిలచి, దాని సహాయముతో రావణునిపై బాణములను ప్రయోగించితివి. నీ వింటినుండి వెలువడిన కఠినములైన బాణములు అతని కిరీటమును పొడిచేసి అతనికి కలతను కల్గించినవి. అలసటను భయమును పొందించినవి. ఆ స్థితిలో అతనిని సంహరించుట చాల సులభము. కాని, ఆ పని బలహీనుడు చేయు పని అని నీవు తలచితివి. అతని అలసటను గ్రహించి, అతనిపై కృప చూపితివి. అతనితో తన ఇంటికి పోయి, అలసట తీరిన తర్వాత బలమును తిరిగి సంపాదించుకొని, యుద్ధమునకు రమ్మని పల్కితివి. ఇట్లు అతడు శ్రమ తీర్చుకొనునట్లు అవకాశము నిచ్చుటచే నీ వీర్యగుణమును లోకము అంతయు పొగడినది.

**59) కుంభకర్ణ కులగిరి విదళన దంభోళిభూత నిఃశంక కంకపత్ర!**

కుంభకర్ణ=కుంభకర్ణుడను, కులగిరి=కులపర్వతమును, విదళన=బ్రద్దలు చేయుటలో, దంభోళిభూత=వజ్రాయుధమైయున్న, నిఃశంక=సందేహమునకు తావు లేని, కంకపత్ర=బాణములను కలవాడా!

రావణుడు పెద్ద ప్రయత్నమును చేసి, కుంభకర్ణుని నిద్రనుండి లేపి, నీతో యుద్ధము చేయుటకు అతనిని పంపెను. ఇంద్రుడు వజ్రాయుధముతో పెద్ద పెద్ద కులపర్వతములను బ్రద్దలు చేయునట్లు నీవు బాణముతో కొండవంటి కుంభకర్ణుని శరీరమును బ్రద్దలుచేసి, అతని శిరస్సును ఖండించితివి. ఇట్లు వీర్యములో ఎవరికిని సందేహము కలుగనట్టి రీతిలో గొప్పతనమును కల్గినది నీ బాణము.

**60) అభిచరణ హుతవహ పరిచరణ విఘటన సరభస పరిపత దపరిమిత కపిబల జలధిలహరి కలకలరవ కుపిత మఘవజిదభిహననకృదనుజ సాక్షిక రాక్షస ద్వంద్వయుద్ధ!**



అభిచరణ=అభిచారహోమము చేయుటకై ప్రజ్వరిల్లచేయబడిన, హుతవహ= అగ్నిని, పరిచరణ=పూజించుటను, విఘటన=పాడు చేయుటకై, సరభస= వేగముతో, పరిపతత్=పైన పడుచున్న, అపరిమిత=అంతులేని, కపిబల=వానర సేన అను, జలధిలహరి=సముద్రప్రవాహమునందలి, కలకలరవ= కలకలమను శబ్దముచే, కుపిత= కోపించిన, మఘవజిత్=ఇంద్రజిత్తును, అభిహననకృత్=వధించిన, అనుజ=లక్ష్మణుని, సాక్షిక=సాక్షిగా గొని, రాక్షస=రాక్షసులతో జరిగిన, ద్వంద్వయుద్ధ=ద్వంద్వయుద్ధమును కలవాడా!

తన సేనలకు పలురీతులలో అపజయము కల్గుటను చూచిన ఇంద్రజిత్తు శత్రు సంహారముకొఱకు ఒక అభిచారహోమమును చేయ ప్రారంభించెను. ఆ యాగమును అతడు పూర్తిచేసినచో అతడు అప్రతిహతమైన బలమును కలవాడగునని భయపడిన విభీషణుడు వానరసైన్యము గ్రహించునట్లు ఆ విషయమును తెలిపెను. దానిని తెలిసికొనిన వానరసైన్యము ఇంద్రజిత్తు అభిచారహోమము కొఱకు ప్రజ్వరిల్ల చేసిన అగ్నిలో హోమము చేయకుండ పాడు చేయవలెనని తలచి, మిక్కిలి వేగముగా పోయినవి. లెక్కకు మించిన వానరసేనలు కలకలమను శబ్దమును సముద్రఘోష వలె పెద్దగా చేయుచు,అతడు హోమము చేయుచోటికి లక్ష్మణుని నాయకత్వములో వెడలినవి. దాని ఘోషతో ఇంద్రజిత్తు హోమమునకు అంతరాయము కల్గినది. దానితో అతడు మిక్కిలి కోపించెను. హోమమును పూర్తి చేయకుండగనే, మధ్యలోనే వానరసేనలను ఎదిరించుటకు ఇంద్రజిత్తు పరుగెత్తి వచ్చెను. అపుడు పెద్ద యుద్ధము జరిగినది. లక్ష్మణుడు గొప్ప అస్త్రమును అభిమంత్రించి, **"ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిః యది"** ఇత్యాదిగా నీ మహిమను పణముగా పెట్టి ఇంద్రజిత్తుపై బాణ ప్రయోగము చేసెను. ఆ అస్త్రము అతనిని వధించెను. లక్ష్మణుడు జయించి, నీ వద్దకు వచ్చి, నీ ఆశీర్వాదమును పొందెను. తన కుమారుని మరణముతో తీవ్రమైన ఆగ్రహమును పొందిన రావణుడు మిక్కిలి బలమును కల మూలబలమును యుద్ధమునకు పంపెను. ఆ మూలబలముతో నీవు లక్ష్మణుని కట్టెదుటనే అద్భుతమైన యుద్ధమును చేసితివి. ఆ యుద్ధమున నీవు గంధర్వాస్త్రమును విడుచుటచే రాక్షససేనలు మోహమును పొంది, అందఱిని నీరూపమును కల్గిన వారినిగానే చూచిరి. దానివలన వారు ఒకరిని వేఱొకరు నిన్నుగా తలచి, పరస్పరము వధించుకొనిరి. అట్టి యుద్ధమున నీవు జయమును పొంది ప్రకాశించితివి.

**61) అప్రతిద్వంద్వ పౌరుష!**

అప్రతిద్వంద్వ=సాటి లేని, పౌరుష=పరాక్రమమును కలవాడా!

ఎంతమంది సైనికులు యుద్ధమునకు వచ్చినను క్షణకాలమున వారిని దగ్ధము చేయగల నీ వీర్యమునకు లోకమున సాటి గలదా!

**62) త్ర్యంబక సమధిక ఘోరాస్త్రాడంబర!**

త్ర్యంబక=శివునికంటె, సమధిక=అధికమైన (ఎక్కువ), ఘోర=భయంకరమై యున్న, అస్త్ర=అస్త్రముల, ఆడంబర=శక్తిని కలవాడా!

నీ అస్త్రముల బలము శివుని అస్త్రబలముకంటె పలురెట్లు అధికమైనది. భయంకరమైనది. ఇట్లయినను, వానరుల ముందు నీకును, శివునకును సమమైన అస్త్రబలము కల్గినట్లు నీవు పల్కుట నీ గొప్పతనమును తెలుపుటయేకాక, మానుష భావనలో తనను మాత్రము పొగడుకొనుట తగినదికాదను ధర్మసూక్ష్మాంశమును తెలుపుచున్నది.

**63) సారథి హృత రథ సత్రప శాత్రవ సత్యాపిత ప్రతాప!**

సారథి=తేరు నడపు సారథిచే, హృత=తిప్పి తీసికొనిపోబడిన, రథ=రథమును కలవాడు, సత్రప=కావుననే లజ్జను కలవాడగు, శాత్రవ=శత్రువగు రావణునిచే, సత్యాపిత=నిజమని నిరూపింపబడిన, ప్రతాప=వీర్యమును కలవాడా!

యుద్ధరంగమున నీ బాణములచే మిక్కిలి బాధను పొందిన రావణుడు అలసట చెందినపుడు సారథి రథమును తిప్పి నడపి, భవనమునకు తీసికొని వచ్చెను. దానిని తెలిసికొనిన రావణుడు మిక్కిలి సిగ్గుపడెను. సారథిపై కోపించి, "అంతు లేని కీర్తిని పొందిన ప్రతాపమును కల రాముని ముందు నన్ను కాపురుషునిగా చేసితివి కదా!" **(శత్రోః ప్రఖ్యాత వీరస్య రంజనీయస్య విక్రమైః... కాపురుష స్త్వయా)** అని సారథిని నిందించెను. ఇట్లు శత్రువు సైతము పొగడునట్టి ప్రతాపమును కలవాడవు నీవు.

**64) శిత శర కృతలవన దశముఖ ముఖదశక నిపతన పునరుదయ దరగళిత జనిత దర తరళ హరిహయ నయన నళినవన రుచి ఖచిత ఖతల నిపతిత సురతరు కుసుమ వితతి సురభిత రథపథ!**

శిత=పదునైన, శర=బాణములతో, కృతలవన=ఖండింపబడిన, దశముఖ =రావణుని, ముఖదశక=పది తలలు, నిపతన=క్రిందపడుటచేతను, పునః ఉదయ =తిరిగి మొలచుటచేతను, దరగళిత=కొంచెము తగ్గినది, జనిత=తిరిగి పుట్టినదియు అగు, దర=భయముచే, తరళ=చంచలుడైన, హరిహయ=ఇంద్రునియొక్క, నయన=కన్నులను, నళినవన=తామర పూలవనముల, రుచి=కాంతితో, ఖచిత=పొదగబడిన, ఖతల= ఆకాశము నుండి, నిపతిత=రాలిన, సురతరు= కల్పకవృక్షముల,కుసుమ=పూవుల, వితతి= సమూహముచే, సురభిత=సుగంధము కల్గినదిగా చేయబడిన, రథపథ=రథము యొక్క మార్గమును కలవాడా!

నీ పదునైన బాణములతో రావణుని పది తలలను ఖండించి, క్రిందకు పడునట్లు చేసితివి. బ్రహ్మవలన వరమును పొందిన వాడగుటచే రావణుని తలలు మరల మరల మొలచినవి. నీవు అతని తలలను ఖండించుట, అవి తిరిగి మొలచుటయు జరిగినది.



రావణుని తలలు ఖండింపబడినపుడు ఇంద్రునకు భయము తీరుట, అవి తిరిగి మొలచినపుడు మరల భయము కల్గుట – ఇట్లు చంచలమైన స్థితి అతనికి ఏర్పడినది. అనంతరము నీవు బ్రహ్మాస్త్రప్రయోగముతో రావణుని శిరస్సులను సమూలముగా ఖండించి, అతనిని వధించితివి. అపుడు మరల అతనికి తలలు పుట్టలేదు. రావణుడు చనిపోవుటను చూచిన ఇంద్రుని వేయికన్నులు తామరవనములవలె వికసించినవి. దేవతలును కల్పవృక్షముల పూవులను వర్షించిరి. వానిచే నీ రథము పయనించు మార్గము అంతయు పరిమళించినది. ఇట్లు రావణుని వధించి, జయమును పొందిన నీవు దేవతలకు గొప్ప ఆనందమును చేకూర్చితివి.

**65) అఖిలజగదధిక భుజబల వరబల దశలపన లపనదశక లవన జనిత కదన పరవశ రజనికరయువతి విలపన వచన సమవిషయ నిగమ శిఖర నికర ముఖరముఖ మునివర పరిపణిత!**

అఖిలజగత్= అందఱు లోకములోని జనులకంటె, అధిక=అధికమైన, భుజబల= భుజబలమును, వరబల=వరబలమును కల్గినవాడగు, దశలపన=పది తలలు కల రావణుని, లపనదశక=పది తలలను, లవన=ఖండించుటచే, జనిత=పుట్టిన, కదన=దుః ఖముచే, పరవశ=తనవశము కోల్పోయిన, రజనికరయువతి= రావణుని భార్యయైన మండోదరియొక్క, విలపనవచన=రోదన వాక్యములతో, సమవిషయ=సమమైన అర్థమును కల, నిగమ శిఖర నికర=వేదాంత సమూహములను, ముఖరముఖ=పల్కు ముఖములను కల, మునివర=గొప్పమునులచే, పరిపణిత=పొగడబడినవాడా!

రావణుని భుజబలము లోకములోనున్న అందఱి భుజబలముకంటె గొప్పది. వరబలము అధికమే. ఇట్టి బలమును కల రావణుని పది తలలను తఱిగి క్రింద పడునట్లు చేసితివి. దానివలన కల్గిన గొప్ప శోకముతో పరవశ అయిన అతని భార్యయగు మండోదరి అతనిపై పడి రోదించినది. ఆ రోదన వాక్యములలో నీ స్వరూప–రూప– గుణ–విభూతులు మొ॥గు సకలవేదార్థముల సారాంశములు అణగియున్నవి. ఆ అర్థములను కల వేదాంతవాక్యములను మునివరులు తమ నోటితో పల్కుచు, నీ కీర్తిని స్తుతించిరి.

**66) అభిగత శతమఖ హుతవహ పితృపతి నిరృతి వరుణ పవన ధనద గిరిశముఖ సురపతి నుతి ముదిత!**

అభిగత=సమీపమునకు వచ్చిన, శతమఖ=ఇంద్రుడు, హుతవహ=అగ్ని, పితృపతి=యముడు, నిరృతి=నిరృతి, వరుణ=వరుణుడు, పవన=వాయువు, ధనద= కుబేరుడు, గిరిశముఖ=శివుడు మొదలగు, సురపతి=గొప్ప దేవతలు చేసిన, నుతి=స్తోత్రముచే, ముదిత=సంతోషించినవాడా!

రావణుడు మరణించుటనుగూర్చి సీతాదేవికి తెలియజేసి, విభీషణుడు ఆమెను నీ వద్దకు తీసికొనివచ్చెను. అపుడు పలు నెలలుగా రాక్షసుని సమీపమున నుండుటచే లోకములోని జనులకు సందేహము కల్గునని తలచిన నీవు ఆమె పవిత్రతను లోకమునకు చూపుటకు అగ్నిప్రవేశమును చేయించితివి. ఆ సమయములో దిక్పాలకులగు ఇంద్ర–అగ్ని–యమ–నిరృతి–వరుణ–వాయు– కుబేర–శివాదులు మిగిలిన దేవతలు అందఱు అచటికి వచ్చి నీ మహిమను కీర్తించి, సీతాదేవిని నీవు పరిగ్రహించునట్లు వేడిరి. వారి స్తోత్రముచే నీవు మిక్కిలి ఆనందించితివి.

**67) అమిత మతి విధి విదిత కథిత నిజ విభవ జలధి పృషత లవ!**

అమిత=అంతు లేని, మతి=బుద్ధిని (జ్ఞానమును) కల, విధి=బ్రహ్మచే, విదిత = తెలిసికొనబడినది, కథిత=చెప్పబడినదగు, నిజ=నీయొక్క, విభవ=గొప్పతనము అను, జలధి=సముద్రములోని, పృషత=జలకణముయొక్క, లవ=అల్పాంశమును కలవాడా!

అపుడు బ్రహ్మయు నీ గొప్పతనమును కీర్తింపదొడగెను. అతని జ్ఞానము అంతు లేనిది. అట్టి బ్రహ్మకూడా నీ మహిమ అను సముద్రములోని ఒక నీటి కణము యొక్క అత్యల్పాంశమును మాత్రమే తెలిసికొని కీర్తింపగల్గెను. బ్రహ్మస్థితియే ఇట్లున్నచో, ఇక మిగిలినవారి స్థితినిగూర్చి చెప్పవలెనా!

**68) విగతభయ విబుధ పరివృఢ విబోధిత వీరశయన శాయిత వానర పృతనౌఘ!**

విగతభయ=భయముతీరిన, విబుధ=దేవతల, పరివృఢ=నాయకుడగు ఇంద్రునిచే, విబోధిత=తిరిగి బ్రతికిన, వీరశయన=యుద్ధరంగమున, శాయిత= చంపబడిన, వానరపృతన+ఓఘ=వానరసైన్యముయొక్క సమూహమును కలవాడా!

రావణుడు వధింపబడుటచే ఇంద్రుడు మొదలగు దేవతలు భయమును తీరిన వారయ్యిరి. ఇంద్రుడు నీవద్ద తన ఆనందమును వ్యక్తము చేసి, నీకు ఏదైన సేవచేయవలెనని తలచి, అందులకు నిన్ను వేడెను. నీవు యుద్ధమున నీ కొఱకు ప్రాణములను విడచిన వానరవీరులు తిరిగి బ్రతుకునట్లు చేయుమని కోరితివి. ఇంద్రుడు ఆ విధముగానే చేసెను. నిద్రపోయి లేచినవారివలె వానరసైన్యము గుంపులు గుంపులుగా ప్రాణములను పొంది లేచి వచ్చిరి. నీ కరుణకు అవధి కలదా!

**69) స్వసమయ విఘటిత సుఘటిత సహృదయ సహధర్మచారిణీక!**

స్వసమయ=తన సంకల్పముచే, విఘటిత=విశ్లేషించినది, సుఘటిత= కలసినదగు, సహృదయ=హృదయముతో కూడిన, సహధర్మచారిణీక=భార్యను కల్గినవాడా!



రావణుని నీవు వధించి, జయించిన వృత్తాంతమును తెలిసికొనిన సీతాదేవి నీ ఎదుటికి వచ్చి నిలచెను. ఆమె పవిత్రతను శంకించు లోకమునకు విశ్వాసము కల్గుటకై ఆమె అగ్నిప్రవేశము చేయునట్లు చేసి ఆమెను విడచితివి. పిమ్మట అగ్ని ఆమెను తీసికొనివచ్చి, ఆమె పవిత్రతను లోకమంతయు గుర్తించునట్లు పల్కెను. అపుడు నీవు మరల ఆమెను కలిసితివి. ఇద్దఱును చేసికొనిన ఒప్పందముచే మొదట నీవు విశ్లేషించుటకు, పిమ్మట కలియుటకును నీ సంకల్పమేకదా కారణము! నీ ధర్మపత్నియైన ఆమె నీ ఇష్టానుసారము ప్రవర్తింపతగినదికదా!

**70) విభీషణ వశంవదీకృత లంకైశ్వర్య!**

విభీషణ=విభీషణునకు, వశంవదీకృత=స్వాధీనమగునట్లు చేయబడిన, లంకా+ఐశ్వర్య=లంకయొక్క పాలనను కలవాడా!

నీ బాహుబలముతో సంపాదించిన లంకైశ్వర్యమును నీదిగానే తలచి, నీకు ప్రతినిధిగా విభీషణుని నియమించి, అతనిద్వారా పరిపాలనను నీవు సాగించియుండ వచ్చును. విశాలమనస్కుడవగు నీవు అట్లు చేసితివా? అతడు పూర్వము నిన్ను శరణాగతి చేయుటయును, "నిన్ను సత్యముగా లంకకు అధిపతిని చేయుదును" అని మాట ఇచ్చి నీవు లక్ష్మణునిచే సముద్రములోని నీటిని తెప్పించి, అతనికి రాజ్యాభిషేకము చేయుటను తలచి, లంకను అతనికి అధీనముచేసి,దానిని సకలస్వాతంత్ర్యముతో అనుభవించునట్లు అనుగ్రహించితివి.

**71) నిష్పన్నకృత్య!**

నిష్పన్నకృత్య=చేయవలసిన పనిని పూర్తిచేసినవాడా!

రావణునివలన కల్గిన బాధచే దుఃఖము పొందిన దేవతలు మొదట శరణు వేడినపుడు వారికి మాట ఇచ్చిన ప్రకారము, రావణుని సంహరించి, వారి భయమును పోగొట్టితివి. శరణు పొందిన విభీషణునకు ఇచ్చిన మాట ప్రకారము అతనిని ప్రభువు గావించితివి. రాక్షసులవలన బాధను పొందిన మునివరులకు ఇచ్చిన మాట ప్రకారము రాక్షసులను వధించి వారి దుఃఖమును తీర్చితివి. ఇట్లు **"కృతకృత్య స్తదా రామః"** అనునట్లు నీ అవతార ప్రయోజనమును పూర్తిచేసితివి.

**72) ఖపుష్పిత రిపుపక్ష!**

ఖపుష్పిత=ఆకాశపద్మమువలె కావించిన, రిపుపక్ష=శత్రుపక్షమును కలవాడా!

నీ భక్తులను సంరక్షించుటకొఱకు వారి శత్రువులను నిర్మూలము గావించి, వారిలో ఒక్కరుకూడ మిగలకుండచేసి, వారిని ఆకాశపుష్పమువలె లేనివారినిగా చేసితివి.

**73) పుష్పక రభసగతి గోష్పదీకృత గగనార్ణవ!**

పుష్పక=పుష్పకవిమానముయొక్క, రభసగతి=వేగమైన సంచారముచే, గోష్పదీకృత= ఆవుపాదమంత చిన్నదిగా చేయబడిన, గగన+అర్ణవ=ఆకాశమను సముద్రమును కలవాడా!

నీవు అయోధ్యకు తిరిగి వచ్చుటకు విభీషణుడు పుష్పకవిమానమును తీసికొని వచ్చెను. అందు నీవు అందఱితో కలసి కూర్చుండి ఆ విమానము, సముద్రమువలె విశాలమైన ఆకాశమును గోష్పాదమంత ప్రదేశమును దాటునట్లు అత్యల్పకాలమున సులభముగా దాటిపోవునట్లు చేసితివి.

**74) ప్రతిజ్ఞార్ణవ తరణ కృతక్షణ భరత మనోరథ సంహిత సింహాసనాధిరూఢ!**

ప్రతిజ్ఞా=శపథమను, అర్ణవ=సముద్రమును, తరణ=దాటుటలో, కృతక్షణ= ఊనికను కల, భరత=భరతునియొక్క, మనోరథ=ఆశకు, సంహిత=తగిన, సింహాసన= సింహాసనమును, అధిరూఢ=అధిరోహించినవాడా!

నీ తమ్ముడగు భరతుడు చిత్రకూటములో నీ పాదుకను పొంది తిరిగి వచ్చునపుడు దాటుటకు వీలు లేని సముద్రము వంటి ఒక గొప్ప శపథమును చేసెను. పదునాల్గు సంవత్సరములు గడచిన వెంటనే నీవు అయోధ్యకు తిరిగి రాకపోయినచో, అగ్నిప్రవేశము చేసి ప్రాణము విడుతును అనునదే ఆ శపథము. అట్లే, పదునాల్గవ సంవత్సరము పూర్తి కాగానే నిన్ను ఎదురుచూచి, నీవు రాకపోవుటచే ప్రాణమును త్యజించుటకు భరతుడు ప్రయత్నించునపుడు, హనుమంతుడు ముందుగా వెడలి, నీ రాకను తెలిపి, అతడు ప్రాణత్యాగము చేయకుండ నిలిపెను. పిమ్మట నీవు తిరిగి వచ్చుటయు, సింహాసనమును అధిష్ఠించియున్న స్థితిలో నిన్ను భరతుడు దర్శించి ఆనందము పొందగోరుటయును జరిగినది. నీవును ఆ విధముగానే సింహాసనారూఢుడవై, లోకమునంతటిని కాపాడితివి.

**75) స్వామిన్!**

స్వామిన్=స్వామీ!

ఆ సింహాసనములో అధిష్ఠించియుండి, సకలలోకములకును స్వామివై వెలిగితివి.

**76) రాఘవసింహ!**

రాఘవసింహ=రఘుకుల ప్రభువులలో గొప్పవాడా!

నిన్ను శరణు పొందినవారిని రక్షించుటలో ప్రసిద్ధి గాంచినది రఘుకులము. అందు అవతరించిన రాజులలో నీవలె శరణు వేడినవారిని కాపాడినవారెవ్వరును లేరు అనునట్లు గొప్పగా ప్రకాశించితివి.



# ఉత్తరకాండము

**77) హాటకగిరి కటక లడహ పాదపీఠ నికటతట పరిలుఠిత నిఖిల నృపతి కిరీట కోటి వివిధ మణిగణ కిరణ నికర నీరాజిత చరణరాజీవ!**

హాటకగిరి=మేరుపర్వతముయొక్క, కటక=చఱియవలె, లడహ= అందమైన, పాదపీఠ=పాదపీఠముయొక్క, నికటతట=సమీపములో, పరిలుఠిత= పొర్లుచున్న, నిఖిల=సకల, నృపతి=ప్రభువుల, కిరీట=కిరీటములలోని, కోటి= అగ్రభాగములందున్న, వివిధ=అనేకములైన, మణిగణ=మణుల సమూహముల కిరణ నికర=కాంతుల సమూహములచే, నీరాజిత=నీరాజన మీయబడిన, చరణ రాజీవ=తామరలవంటి పాదములను కలవాడా!

నీవు అయోధ్యలో పట్టాభిషిక్తుడవై రాజ్యసింహాసనమును అధిష్ఠించితివి. అపుడు నీ పాదములను తాకు పెద్ద పాదపీఠము మేరు పర్వతముయొక్క సానువువలె అందముగా గోచరించినది. లోకములోని ప్రభువులు అందఱును నీ పాదపీఠము సమీపమున తమ కిరీటములను పెట్టి శిరస్సుతో నమస్కరించిరి. అపుడు ఆ కిరీటముల అగ్రభాగములందు పొదగబడియున్న పలు గొప్ప రత్నముల కాంతి నీ పాదపద్మములకు మంగళనీరాజనము ఇచ్చుచున్నట్లు తోచినది. అందమైన దను అర్థమిచ్చు **లడహ** అను పదము ప్రాకృత పదము.

**78) దివ్య భౌమాయోధ్యాధిదైవత!**

దివ్య=పై లోకముననున్నది, భౌమ=ఈ లోకముననున్నది అగు, అయోధ్యా= అయోధ్యకు, అధిదైవత=ప్రభువైయున్నవాడా!

దివ్యలోకమగు వైకుంఠము అయోధ్య అను పేరును కల్గినది. అట్లే ఈ లోకములోని నీ రాజధానియు అయోధ్య అని పిలువబడుచున్నది. ఈ రెండు లోకములను నీ అధీనములో కల్గిన నీవు, ఉభయ విభూతినాయకుడవనుచు పొగడబడుచున్నావు.

**79) పితృవధ కుపిత పరశుధరముని విహిత నృపహనన కదన పూర్వకాల ప్రభవ శతగుణ ప్రతిష్ఠాపిత ధార్మిక రాజవంశ!**

పితృవధ=తన తండ్రి వధచే, కుపిత=కోపమును పొందిన, పరశుధర ముని= పరశురాముడను మునిచే, విహిత=చేయబడిన, నృపహనన కదన=రాజులను వధించు యుద్ధమునకు, పూర్వకాల ప్రభవ=ముందు కాలమున పుట్టియున్న వాని కంటె, శతగుణ=నూఱు రెట్లుగా, ప్రతిష్ఠాపిత=స్థాపింపబడిన, ధార్మిక= ధర్మము తప్పని, రాజవంశ=రాజకులములను కలవాడా!

త్రేతాయుగారంభమున పుట్టిన పరశురాముడు తన తండ్రియగు జమదగ్ని మునిని కార్తవీర్యార్జునుడు అను రాజు వధించుటచే, మిక్కిలి కోపించినవాడై, రాజకులము నంతటిని వధించెను. ఆ దుఃఖకరసంఘటనకు ముందు ఎన్ని సత్ క్షత్రియ వంశములుండెనో, వానికంటె నూఱు రెట్లు ధార్మికరాజవంశములను నీవు తిరిగి స్థాపించితివి.

**80) శుభచరిత రత భరత ఖర్విత గర్వ గంధర్వ యూథ గీత విజయగాథాశత!**

శుభచరిత=సత్ ప్రవర్తనయందే, రత=ఆసక్తిని కల, భరత=భరతునిచే, ఖర్విత= అణగదొక్కబడిన, గర్వ=గర్వమును కల, గంధర్వయూథ=గంధర్వుల సమూహముచే, గీత=కీర్తింపబడిన, విజయగాథాశత=అనేకవందల విజయగాథలను కలవాడా!

సింధునదీ తీరములు రెండింటియందు గంధర్వులు నివసించెడివారు. వారు తమ ధర్మములను విడచి, మిక్కిలి గర్వముతో జనులను బాధింప ప్రారంభించిరి. అపుడు భరతునకు మేనమామయగు యుధాజిత్తు నీ వద్దకు వచ్చి, వారిని శిక్షింపవలసినదిగా ప్రార్థించెను. నీవు భరతుని అందులకై పంపితివి. సత్కార్యములను చేయుటలోనే ఆసక్తిని కల భరతుడు అచటికి వెడలి, గంధర్వుల గర్వమును అణచి, వారు తమ విధ్యుక్తధర్మము లను పాటించి, సన్మార్గమును అనుసరించునట్లు చేసెను. అందువలన సంతోషించిన గంధర్వులు నీ విజయకీర్తిని పలుమాఱు పాటలతో పాడిరి.

**81) శాసిత మధుసుత శత్రుఘ్న సేవిత!**

శాసిత=వధింపబడిన, మధుసుత=లవణాసురుని కల, శత్రుఘ్న=శత్రుఘ్నునిచే, సేవిత=ఆరాధింపబడినవాడా!

మధురానగరమున గల మధువు అను అసురునకు లవణాసురుడను పుత్రుడు కల్గెను. అతడు మునులను బాధింపసాగెను. దానివలన వారు నీవద్దకు వచ్చి, ఆ అసురుని చంపి తమను రక్షింపవలసినదిగా నిన్ను వేడిరి. నీవు శత్రుఘ్నుని పంపి, ఆ అసురుని సంహారమును గావించి మునుల కష్టములను పోగొట్టితివి. జయించిన శత్రుఘ్నుడు తిరిగి వచ్చి, నీ పాదములకు నమస్కరించి, నిన్ను సేవించెను.

**82) కుశలవ పరిగృహీత కులగాథావిశేష!**

కుశలవ=కుశలవులచే, పరిగృహీత=అభ్యసింపబడిన, కులగాథావిశేష=నీ వంశమునకు చెందిన కథలను కలవాడా!

వాల్మీకిముని ఆశ్రమములో సీతాదేవి గర్భమున పుట్టిన నీ కుమారులగు కుశలవులు మేధావులై యుండుటను చూచిన వాల్మీకిముని నీ వంశమహిమను కీర్తించు



శ్రీరామాయణమును వారికి నేర్పించెను. వారు దానిని చక్కగా నేర్చి, మధురముగా పాడిరి.

**83) విధివశ పరిణమ దమరభణితి కవివర రచిత నిజచరిత నిబంధన నిశమన నిర్వృత!**

విధివశ=దైవవశముచే, పరిణమత్=శ్లోకముగా మారుచున్న, అమరభణితి =సంస్కృత వాక్కును కల, కవివర=గొప్ప కవియగు వాల్మీకిచే, రచిత=రచింపబడిన, నిజచరిత=నీ చరిత్రను వర్ణించు, నిబంధన=శ్రీమద్రామాయణ గ్రంథమును, నిశమన=వినుటచే, నిర్వృత=ఆనందించినవాడా!

ఒకనాడు స్నానము చేయుటకు వెడలిన వాల్మీకిముని ఒక వేటగాడు క్రౌంచ పక్షుల జంటలో మగపక్షిని చంపుటను చూచెను. దానిచే శోకమును పొందిన ముని యాదృచ్ఛికముగా వానిని శపించు రీతిలో ఒక శ్లోకమును పల్కెను. అదియే నీకు మంగళశ్లోకమైనది. దానినుండియే అద్భుతమైన ఆదికావ్యమగు శ్రీరామాయణము ఆవిర్భవించినది. ఇట్లు వాల్మీకిముని శోకమే శ్లోకముగా మాఱి, దాని మూలముగా శ్రీరామాయణము అను అద్భుతకావ్యము అవతరించుటకు కారణము దైవలీలయే. లేక మానవుల భాగ్యవిశేషమనియు చెప్పవచ్చును. నీ చరిత్ర అంతటిని దేవభాషయైన సంస్కృతమునందే వివరముగా తెలుపు ఈ గ్రంథమును కుశలవులు అశ్వమేధయాగ మహామండపములో మధురముగా పాడిరి. దానిని విని నీవు ఆనందించితివి.

**84) సర్వజన సమ్మానిత!**

సర్వజన=జనులందఱిచే, సమ్మానిత=గౌరవింపబడినవాడా (బాగుగా కీర్తింపబడిన వాడా).

నీ సభామండపమున కుశలవులు శ్రీరామాయణమును గానము చేసినపుడు, దానిని వినిన సకలజనులును నీ మహిమను చక్కగా గుర్తించి, నిన్ను బాగుగా కీర్తించిరి.

**85) పునరుపస్థాపిత విమానవర విశ్రాణన ప్రీణిత వైశ్రవణ విశ్రావిత యశః ప్రపంచ!**

పునః=మరల, ఉపస్థాపిత=రప్పింపబడిన, విమానవర=గొప్ప పుష్పక విమానమును, విశ్రాణన=ఇచ్చుటచే, ప్రీణిత=సంతోషించిన, వైశ్రవణ=కుబేరునిచే విశ్రావిత=ప్రకటింపబడిన (వినిపింపబడిన) యశః ప్రపంచ=కీర్తి విస్తృతిని కలవాడా!

కుబేరుని పుష్పకవిమానమును అపహరించి రావణుడు లంకలోనికి తీసికొని పోయెను. రాజ్యాభిషిక్తుడైన విభీషణుడు దానిని నీవు అయోధ్యకు వేంచేయుట కొఱకు సమర్పించెను. నీవు నగరమునకు తిరిగి వచ్చిన పిదప దానిని కుబేరునకు తిరిగి

పంపితివి. కుబేరుడు నీకు సేవచేసికొనుటకై మఱల ఆ విమానమును నీకు పంపెను. నీవు దానిని కొంచెము కాలము నీ వద్ద ఉంచుకొని, పిమ్మట దానిని కుబేరునకు తిరిగి పంపినావు. నీ గొప్పతనమును గమనించిన కుబేరుడు నీ కీర్తిని లోకమంతయు తెలియునట్లు పొగడెను.

**86) పంచతాపన్న మునికుమార సంజీవనామృత!**

పంచతా+ఆపన్న=మరణించిన, మునికుమార=మునిపుత్రుని, సంజీవన+అమృత=తిరిగి బ్రతికించు అమృతమువంటివాడా!

నీవు పాలన చేయునపుడు ఒక బ్రాహ్మణకుమారుడు అకాలమరణము పొందెను. అందుచే శోకము పొందిన బ్రాహ్మణుడు నీవద్దకు వచ్చి, నీ పాలనలోని లోపముచే తనకు అట్టి శోకము కల్గెనని పల్కి రోదించెను. దానికి మూలమైన కారణమును నారదముని నీకు తెలియజేసెను. నీవు పుష్పకవిమానమును ఎక్కి వెడలి, ఒక కొలనుతీరమున ఒక వృక్షమునందు తలక్రిందులుగా నిలచి, ఈ దేహముతోనే స్వర్గమునకు పోవలెనను ఉద్దేశ్యముతో తీవ్రమైన తపస్సును చేయుచున్న శూద్రుని చూచితివి. అతడు తన జాతికి తగని తపస్సును చేయుటచే, బ్రాహ్మణుని పుత్రుడు అకాలమరణము నొందెనని నీవు గ్రహించి, అతని శిరస్సును ఖండించితివి. వెంటనే బ్రాహ్మణబాలుడు తిరిగి బ్రతికెను. ఇట్లు చనిపోయిన బాలుని బ్రతికించు అమృతముగా నీవు అయితివి.

**87) త్రేతాయుగ ప్రవర్తిత కార్తయుగ వృత్తాంత!**

త్రేతాయుగ=త్రేతాయుగములో, ప్రవర్తిత=నడచునట్లుచేయబడిన, కార్తయుగ=కృతయుగమునందలి, వృత్తాంత=ధర్మములను కలవాడా!

త్రేతాయుగములో కృతయుగములో కంటె ధర్మము క్షీణించును. నీవు అవతరించి రాజ్యపాలనచేయు కాలము త్రేతాయుగము. నీ రాజ్యములోని జనులు ధర్మము ఏమాత్రము వీడకుండ నడుచునట్లు నీవు పాలించుటచే, ఆ ధర్మము తల ఎత్తక, కృతయుగ ధర్మమే చక్కగా ప్రవర్తించినది. ఇట్లు త్రేతాయుగమందును కృతయుగ ధర్మమును లోకమున నీవు నడచునట్లుచేసితివి.

**88) అవికల బహుసువర్ణ హయమఖ సహస్ర నిర్వహణ నిర్వర్తిత నిజ వర్ణాశ్రమధర్మ!**

అవికల=కొఱత లేని, బహుసువర్ణ=గొప్ప సువర్ణమే దక్షిణగా కల, హయమఖ సహస్ర=వేలాది అశ్వమేధయాగములను, నిర్వహణ=చక్కగా పూర్తి చేయుటచే, నిర్వర్తిత=బాగుగా నెఱవేర్చబడిన, నిజవర్ణ+ఆశ్రమధర్మ=తనజాతి, ఆశ్రమములకు తగిన ధర్మములను కలవాడా!



అశ్వమేధయాగములను చేయుట ప్రభువులకే సాధ్యము. ఈ యాగములో అంతులేని బంగారమును దక్షిణగా దానమీయవలెను. నీవు అట్టి అశ్వమేధ యాగములను వేల సంఖ్యలో ఎట్టిలోపము లేకుండ నిర్వహించి పూర్తిచేసితివి. ఇట్లు నీవు మిక్కిలి శ్రద్ధతో యాగములను చేసి, నీ జాతికి, గృహస్థాశ్రమమునకు తగిన ధర్మములను పూర్తిచేసినవాడవైతివి. సర్వేశ్వరుడవగు నీకు ఈ యాగములు మొదలగునవి చేయవలసిన అవసరము లేకపోయినను, నీవు క్షత్రియుడవై అవతరించి, గృహస్థ ధర్మమును స్వీకరించి, మానుషభావన చేయుటకు తగినట్లు యాగాదులను చేయుటయు నీకు కర్తవ్యమైనది. ఇంతియేనా! లోకము ఆయా జనులు తమ తమ జాతికి, ఆశ్రమమునకు తగిన ధర్మములను చేయవలసియుండునను సత్యమును నీవిట్లు తెలియజేసితివి.

**89) సర్వకర్మ సమారాధ్య!**

సర్వకర్మ=సమస్త కర్మలచే, సమారాధ్య=బాగుగా ఆరాధింపతగినవాడా!

లోకములు ఎవరు ఏ యాగమును గాని, వేఱొక కర్మనుగాని ఏ దైవమును ఉద్దేశించి చేసినను, ఆ కర్మలచే నిజమునకు నీవే ఆరాధింపబడుచున్నావు. ఏ దైవమును పూజించినను, ఆ దైవములకును అంతర్యామియైన నిన్నే ఆ ఆరాధన లన్నియు చేరును.

**90) సనాతనధర్మ!**

సనాతనధర్మ=శాశ్వతమైన ధర్మమైయున్నవాడా!

లోకములో అన్ని ధర్మములను ప్రవర్తింపజేసి, వాని అన్నిటిచే నీవే ఆరాధింపబడుచున్నను, ఆ ధర్మముయొక్క రూపముగా నుండువాడవు నీవే అగుచున్నావు. కర్మరూపమైన ధర్మములు క్షణకాలములో నశించు స్వభావమును కల్గినవగుటచే, అవి ఫలమును ఇచ్చు శక్తిని కల్గినవి కావు. ఆ కర్మలచే నీవు సంతోషించి, ఆ యా ఫలములను ఇచ్చువాడవు నీవే అగుటచే నశింపని శాశ్వతమైన ధర్మము, నీవే అగుచున్నావు.

**91) సాకేతజనపద జనిధనిక జంగమ తదితర జంతుజాత దివ్యగతి దాన దర్శిత నిత్య నిస్సీమ వైభవ!**

సాకేతజనపద=కోసలరాజ్యమున, జనిధనిక=జన్మయే సంపదగా కల్గిన, జంగమ=జంగమములు, తదితర=వానికంటె వేఱయిన స్థావరములు మొదలగు, జంతుజాత=ప్రాణి సమూహములకు, దివ్యగతి=ఉన్నతలోకమును, దాన=అనుగ్రహించుటచే, దర్శిత=చూపబడిన, నిత్య=శాశ్వతమైన, నిస్సీమ=అవధి లేని, వైభవ=గొప్పతనమును కలవాడా!

నీవు అవతార ప్రయోజనమును పూర్తి చేసికొని, నీ స్వస్థానమగు వైకుంఠమునకు వేంచేయునపుడు కోసలరాజ్యములోనున్న స్థావర- జంగమములగు సకల ప్రాణులును నిన్ను అనుసరించినవి. అవి సద్గతిని పొందుటకు ఏ ఉపాయమును అనుష్ఠింపలేదు. అయినను నీ రాజ్యమున జన్మించుటయే ఒక సాధనముగా తలచిన నీవు బ్రహ్మను పిలచి వానికి ఉన్నతలోకములను అనుగ్రహించునట్లు ఆజ్ఞాపించితివి. బ్రహ్మయు వానికి సాందానికమను లోకమును ఇచ్చి, అనుగ్రహించెను. ఇట్లు నీ రాజ్యమున నివసించుటయే కారణముగా గొని ఉన్నత లోకములను ఇచ్చుటనుగూర్చి లోకమంతయు "నీ మహిమ అవధి లేనిది" అనియు, "ఏనాటికిని నశింపనిది" అనియు తెలిసికొన్నది. ఇట్లు నీవు చేసిన ఆ పనియే నీ మహిమను తెలియజెప్పినది.

**92) భవ తపన తాపిత భక్తజన భద్రారామ!**

భవ=సంసారమను, తపన=సూర్యునిచే, తాపిత=తపింపబడిన, భక్తజన= భక్తుల సమూహమునకు, భద్ర=మంగళకరమైన, ఆరామ=పూలతోటవంటివాడా!

సూర్యుని తాపముచే తపించు ప్రాణులకు చల్లని పూలతోట లభించినచో వారి తాపము తీరి ఊరటను పొందవచ్చును. సంసారమను సూర్యుని వేడిమిచే అలమటించు భక్తులు నీ దివ్యరూపము అను పూలతోటను తలచి, అనుభవించుటచే సంసార తాపమంతయు తీరి, గొప్ప గతిని పొందుదురు.

**93) శ్రీరామభద్ర!**

శ్రీరామభద్ర=శ్రీరామభద్రా!

నీ రూపసౌందర్యమును చూపి అందఱిని దానిలో ఆసక్తులగునట్లు చేసి, అందఱికిని మంగళమును కల్గించువాడవు నీవు.

**94) నమస్తే పునస్తే నమః!**

తే=నీకు, నమః=నమస్కారము, పునః=మరల, తే=నీకు, నమః= నమస్కారము.

ఇట్టి మహిమను కలవాడవై, సర్వేశ్వరుడవైయున్న నీకు పలు మార్లు నమస్కరించుచున్నాను.

**95) చతుర్ముఖేశ్వరముఖైః పుత్రపౌత్రాదిశాలినే।**
**నమః సీతాసమేతాయ రామాయ గృహమేధినే॥**

చతుర్ముఖ=బ్రహ్మ, ఈశ్వర=శివుడు, ముఖైః=మొదలగువారిచే, పుత్రపౌత్ర = పుత్రులు, మనుమలు, ఆదిశాలినే=మొదలగువారిని కల్గినవాడు, సీతాసమేతాయ =సీతతో కూడియున్నవాడు, గృహమేధినే=గృహస్థధర్మమును పాటించువాడును అగు, రామాయ=రామునకు, నమః=నమస్కారము.



శ్రీరాముడై అవతరించిన సర్వేశ్వరునకు బ్రహ్మ, శివుడు మొదలగువారు పుత్రపౌత్రాదులు, అనగా- బ్రహ్మ కుమారుడు, శివుడు పౌత్రుడు, కుమారస్వామి, వినాయకుడు మొదలగువారు ప్రపౌత్రులు. సీతాదేవితో కలసి శ్రీరాముడు గృహస్థ ధర్మమును పాటించువాడు అయినను, లోకమే అతని కుటుంబము. లోకములోని అందఱు ఆయన సంతానమేకదా! ఇట్టి రాముని నేను సేవించుచున్నాను.

**శ్లో॥ కవికథకసింహకథితం కఠోరసుకుమారగుంభగంభీరమ్।**
**భవభయభేషజమేతత్ పఠత మహావీరవైభవం సుధియః॥**

సుధియః=విజ్ఞులారా!, కవి=కవులకు, కథక=తార్కికులకును, సింహ= సింహము వంటివాడగు వేదాంతదేశికులచే, కథితమ్=పలుకబడినది, కఠోర= కఠినమైన, సుకుమార=మృదువైన, గుంభ=పదముల కూర్పును కల్గినదై, గంభీరమ్ =లోతైన అర్థమును కల్గినది, భవ=సంసారమువలన కల్గిన, భయ=భయమును పోగొట్టు, భేషజమ్=మందును అగు, ఏతత్=ఈ, మహావీరవైభవం=మహావీరవైభవమను గద్యస్తోత్రమును, పఠత=పఠింపుడు.

కవులు, తార్కికులు అను ఏనుగులకు సింహమువంటివాడై, వారిని జయించు శ్రీ వేదాంతదేశికులచే ఈ గద్యరూపములోనున్న స్తోత్రము రచింపబడినది. ఈ స్తుతి యందు కూర్పబడిన పదములలో కొన్ని కఠినమైనవి, మఱికొన్ని సుకుమారమైనవి, ఇందు పలు అపూర్వార్థములు గంభీరముగా నున్నవి. సంసారమను వ్యాధికి భయపడువారు ఈ స్తుతిని తగిన మందుగా తలతురు. దీనిని పఠించి, శ్రీరామునియందు భక్తిని కల్గి, ఆ స్వామి పాదములందు ప్రపత్తిని చేసినచో, సంసారబంధము తీరి మోక్షము పొందవచ్చును. సాటి లేని మేటివీరుడగు శ్రీరాముని మహిమను కీర్తించు మహావీర వైభవము అను ఈ స్తుతిని ఓ విజ్ఞులారా! మీరును పఠించి, ఉజ్జీవించి, ఆనందింతురు గాక!

**శ్లో॥ కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే।**
**శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః॥**

**శ్లో॥ శ్రీమద్దేశికరచితం భక్తజనశ్రుతిరసాయనం దివ్యమ్।**
**రఘువరగద్యం వివృతం భక్త్యా శ్రీశింగరార్యదాసేన॥**

**శ్లో॥ హంసక్షీరనయేనాత్ర విద్వాంసో గుణతత్పరాః ।**
**విధాయ కరుణాదృష్టి మనుగృహ్ణంతు సాదరమ్ ॥**

